ఖ్యాత ఇటలీ నవల



# సైకిల్ దొంగ

# సైకిల్ దొంగ

## (Bicycle Thief)

మూలం :

బార్టోలినీ

అనుసరణ :

శ్రీనివాస చక్రవర్తి

వినోదా పబ్లికేషన్స్
విజయవాడ-2.

నవోదయా ప్రచురణ
తొలి ముద్రణ
1956

వెల :
సాదాప్రతి : 1–4–0
మేలుప్రతి : 1–8–0

ముఖచిత్రం :
శంకర్, సంజీవి

బైండింగ్:
అప్లైడ్ బైండర్సు,
విజయవాడ-2.

ముద్రణ :
వాహిని ప్రెస్,
విజయవాడ-1.

5

నా కొత్తసైకిలు నిన్నపోయింది! చెప్పులదుకాణంలోకి వెళ్ళబోతూవుంటే నాకళ్ళముందరే ఎవడో నాసైకిలు కొట్టే శాడు. ఇక ఈ మాంటీబజారులో దాన్ని వెతికి పట్టుకోవాలి. రోమ్‌నగరంలోని దొంగలకీ ప్రాంతంఆటపట్టు. పూర్వంకంటె ఇపుడు దొంగలిక్కడ వందరెట్లు అధికమయారు. ఇక్కడే వారి హోటళ్ళు, దుకాణాలు, సారాకొట్లు, మొదలయినవి ఉన్నాయి.

నల్ల బూటుపాలిష్ కోసం సోక్రిఫారోడ్డు అంతా తెగతిరిగాను. కాని దొరకలేదు. నవోనా బజారులో దురదృష్టవశాత్తూ కూరగాయలమ్మేవాళ్ళకడ్డ అడిగితే బాలాకీరోడ్డులో దొరుకుతుందేమోచూడమన్నాడు. అక్కడికి వెళ్ళాలని నాకు అనిపించలేదు. కాని బూటుపాలిషు నాకు చాలాఅవసరం. పైగా కొందరపనుల్లోఉన్నాను. తీరా అక్కడికి వెళ్ళి ఒక దుకాణదారుని అడిగితే బయటికి తెచ్చియిన్వాడానికి అభ్యంతరం చెబుతూ,

"లోపలికిరా. బయటికి యెవరుతెచ్చియిస్తారు" అన్నాడు.

దానిమీద నా సైకిలుని దుకాణం కిటికీకి ఆనించి లోపలికి వెళ్ళాను.

దుకాణంలోకి అడుగుపెట్టానో లేదో పక్క కిటికీదగ్గర ఒక మనిషిముఖం కనిపించింది. ఆ మనిషి సైకిలుకు తాళం వేసుందో లేదోఅని పరీక్షగా చూస్తున్నాడు. దుకాణదారుతో

"ఒకనిమిషం ఆగు. ఆ మనిషి వాలకం ఏం బాగున్నట్లేదు." అందామనుకుంటూంటే ఈ లోగానే ఆ మనిషి నా సైకిలుని టపీమనిపట్టుకుని, ఎక్కి, బర్రున తొక్కుకుంటూ చక్కా పోయాడు. ఆ దొంగ ఖాయిలాపడిలేచినవాడిలా ఉన్నాడు. బట్టలుమాసిపోయాయి. షైలేదు. ఖైదీకిలాగా తల అంటకత్తిర వేయించుకున్నాడు.

"నా సైకిలు ఎత్తుకుపోతున్నాడు" అని కేకపెట్టి దొంగవెంట పడ్డాను. కాని ఇద్దరుముగ్గురు, వాడి తోటి దొంగ లనుకుంటా; నా దారికడ్డంవచ్చి ఆ దొంగపట్టుబడి తీరతాడని నాకు ధైర్యం చెప్పారు. అందులో ఒకడు "అదిగో పట్టు బడ్డాడు, పట్టుబడ్డాడు" అనికూడా అరిచాడు.

కాని దొంగ పట్టుబడలేదు. వాడి స్నేహితులిద్దరు వాడినిపట్టుకోడాకి పరుగెత్తుతున్నట్టు నటించారు. దొంగ విటోరియో ఎమాన్యుయల్ వైపుకి నా సైకిలు తొక్కు-కుంటూ పోతున్నాడు.

"దొంగ! దొంగ! పట్టుకోండి!" అని నేను కేకలు వేశాను. కాని ఒకడూ దొంగను ఆపలేదు. పైగా ఇంకా ఇద్దరు ముగ్గురు, వాడి తోటిదొంగలు, సైకిళ్ళమీద వాడి వెంటపడుతున్నట్టు నటించారు, అక్కడ చేరిన గుంపు వారికి దారిచ్చింది. నేను కేకలు పెడుతూనేఉన్నా. దొంగసైకిళ్ళమ్మే వాడో, లేకపోతే ఆ దొంగకి స్నేహితుడో ఒకడు ఇంకో సైకిలు తొక్కే-వాని వెనకాలపడి వాణ్ణిపట్టుకు చక్కావచ్చాడు.

"యిదేనా నీ సైకిలు ?" అని నన్ను ప్రశ్నించాడు.

ఆ సైకిలు నిజానికి నాదికాదు. అతన్ని ప్రశ్నలతో గుచ్చెత్తుదామనుకున్నా గాని అతను గొడవ చేయడం మొదలుపెట్టేసరికి యెందుకొచ్చిందని వదిలేశాను. కను చూపు మేరలోనే గనక పోలీసు కనిపించిఉంటే అతన్ని వదిలే వాడినిగాను. అయితే ఈ అరాచకపు రోజుల్లో పోలీసు లెక్కడ కనిపిస్తారు ? నా చుట్టూ చేరిన జనం పోలీసుస్టేషనుకు వెళ్ళమని నాకు సలహా ఇచ్చారు. ఈ జనమంతా తెలివితక్కువ వాళ్ళో, దొంగలో అయి ఉండాలి. ఎందుకంటె సంవత్సరం పైచిలుకునించీ పోలీసులు ఏదో ఒరగబెడతారనే ఆశ అడుగంటింది. వ్రాతమూలకంగా ఫిర్యాదు చేసినా లాభం ఉండదు. పైగా వృధా కాలయాపన. పోలీసులు మనలని చవటదద్దమ్మల్ని చేసి కూర్చోబెట్టకుండా ఉంటే అదృష్టవంతులమే. ఇక వాళ్ల డ్యూటీ ప్రకారం దొంగని పట్టుకునే విషయంలో అంటారు.

"ఏకళ్ళా, యిద్దరా? వందలకొలదీ దొంగల్ని వెతకాలి రెజీనా జైలునిండా వాళ్ళేనాయె. మేంమట్టుకు యేంచావం? ఆ గొడవేదో నువ్వే పడు" అనో లేకపోతే, "మేం చేయగలిగిందంతా చేస్తాం. నీ టెలిఫోను నెంబరు యిచ్చివెళ్ళు." అనో అంటారు.

ఇదంతా వృధా ప్రయాస. ఏ పోలీసూ సైకిలు కోసరంగాని, దొంగకోసరంగాని వెదికిచావడు.

నా సైకిలు చాలా అందమైంది. తేలికయింది. టైర్లు కొత్తవి. ముందు చక్రం ట్యూబుకి ఒక అతుకు, వెనక చక్రం ట్యూబుకి రెండు అతుకులు మాత్రమే ఉన్నాయి. పందెపు గుర్రంలాంటి హాండిల్ బారూ, ఒకతట్ట. అల్యూమినం పంపు - నా సైకిలు చూడముచ్చటగా ఉంటుంది. ఇలాంటి నా సైకిలుని దొంగిలించిన ఆదొంగ మొనమొన్ననే రెజీనా జైలునించి బైట పడ్డవాడో, మొన్న జైలులో ఒకపక్క తగలడుతూంటే తప్పించుకు వచ్చినవాడో అయి ఉంటాడు. మళ్ళీ దొంగతనాలకి దిగడం మినహా తనకి గత్యంతరం లేదని అనుకున్నాడు. ఇంకేం నా సైకిలుని దర్జాగా కొట్టేశాడు. జనం అంటే వాడికి భయంలేదు. దొంగతనానికి ఏర్పాట్లన్నీ చక్కగా చేసుకున్నాడు. నా చుట్టూ గుమిగూడిన జనం నన్ను దొంగలకి నెలవయిన మాంటీ బజారికి వెళ్ళమని సలహా ఇచ్చారు. అక్కడే దొంగవస్తువులు అమ్ముతూంటారు.

పొద్దస్తమానం ఆ చౌకులో జనం కిక్కిరిసుంటారు. వాళ్ళని తోసుకుపోవడమే మహాకష్టం. అక్కడ రకరకాల దొంగలుపోగవుతారు. వీళ్ళు దొంగిలించని వస్తువంటూ లేదు. ఆ చౌకు తళతళ మెరిసే సైకిళ్ళతోనిండివుంటుంది. కొత్త సైకిళ్ళేకాదు. పాతవి, చెడిపోయినవి కూడా కనిపిస్తాయి. ఇక్కడ కొత్తమోడలు బియాంకిన్ సైకిళ్ళుకూడా దొరుకుతాయి. ఒక్క దీపానికి మూడువేల లీరాలడుగుతారు. ఇక్కడే ఎనిమిది ముప్పావు టైర్ల ఖరీదు ఇక్కడే కొన్ని [illegible]

లీరాలు. ట్యూబులు ఒక్కొక్కటి పదహారువందల లీరాలదాకా అమ్ముడుపోతాయి. ఇక్కడ దొంగలు ట్యూబులు, టైర్లు బొత్తులు బొత్తులుగా తీసుకుపోతూంటారు. కొంతమంది బజారు చిట్టచివర ముడికిముప్పట్లు పరిచి వాటిమీద దొంగిలించిన సైకిళ్ళ విడిభాగాలు అమ్మజూపుతారు. దొంగిలించగానే సైకిలును ఏ భాగాని కా భాగం ఊడదీయడమో గుర్తుపట్టకుండా రంగుపూయడమో చేస్తుంటారు.

సైకిలు భాగాలు గుర్తుపట్టడానికి వీలుగాఉంటే దానిని ఏ భాగాని కా భాగం ఊడగొట్టేస్తారు. అలా ఊడగొట్టి ఒక్కొక భాగం అమ్మేస్తారు. ఇవాళ హాండిల్ బారు అమ్మితే రేపు చక్రాలు, ఎల్లుండి పెడలు. ఇలాగా రోజు కో భాగం అమ్ముతారు. కాని సైకిలు కొత్తదయి గుర్తులేమీ లేకపోతే దానికి కొత్తరంగుపూసి రిజిష్టరు మార్కులు గీకేస్తారు. లేకపోతే గుర్తుపట్టకుండా హాండిల్ బారో, మడ్గార్డో, ఫ్రేములో మార్చేస్తారు. ఇక దొంగలు: కొంతమంది మంచి మంచి దుస్తులు వేసుకుంటారు. కొంతమంది సాదాదుస్తుల్లో ఉంటారు. బట్టలు అసహ్యంగాఉంటే అందరి దృష్టి వాళ్ళమీదపడుతుంది. ఇలాంటి జైలుపక్షులు దొంగసైకిలుబారుకు అనుకుని అటూ ఇటూ తిరుగుతూంటారు.

దొంగల్లాగా కనిపించకుండా మంచిమంచి దుస్తులు ధరించేవారిని పరిశీలనగా చూడటం నా కిష్టం. వీళ్ళు గవర్నమెంటు వర్కర్లలాగా, చిన్నచిన్న వర్తకుల్లాగా కనుపిస్తారు. శుభ్రంగా క్షవరం చేయించుకుని, బాగా యిస్త్రీ చేసిన చొక్కా

వేసుకుని, చేతికి గడియారం పెట్టుకుని, అమెరికన్ తరహా బూట్లు తొడుక్కుంటారు. వాళ్ళకళ్ళు ఎక్కువగా బూడిద రంగుగా ఉంటాయి. ముక్కులు వెడల్పుగా పొట్టగా ఉంటాయి. మనిషిని చూడగానే అతనెవరయిందీ, ఏమిటి ఆలోచిస్తున్నదీ చెప్పే శక్తినాకుంది. అయితే కొంతమంది దొంగలు అతి దర్జాగా దుస్తులువేసుకుని, అతి మర్యాదగా ప్రవర్తిస్తారు. ఇలాంటి వాళ్ళ విషయంలో నేనే ఒక్కోకప్పుడు మోసపోతూం టాను. నేనేకాదు, కొంతమంది దొంగలే మోసపోతారు. ప్రతి దొంగా ప్రతి దొంగనీ ఎరిగుండాలని ఎక్కడుంది? అదీ గాక ఇక్కడి దొంగలంతా ఒకముఠావాళ్లుగాదు. ఇక్కడ చాలా ముఠాలున్నాయి.

కొద్ది కాలంకితం ఇంగ్లీషువాళ్ళూ, అమెరికావాళ్ళూ, రోమ్ నగరంలోని వ్యభిచార గృహాలన్నిటినీ మూయించి వేశారు. అంతకుముందు ఈ ముఠావాళ్ళు రాత్రల్లా వేశ్యలతో గడిపి ఉదయం ఆరుఏడు గంటల మధ్య లేచి దొంగతనం చేయడానికి ప్లాను వేస్తుండేవారు. డాబుగా దుస్తులు ధరించి, జుత్తు దువ్వుకుని మళ్ళీ దొంగతనానికో, ఆ కిందటి రోజున దొంగిలించినవి అమ్మడానికో బయలుదేరేవాళ్ళు. వీళ్ళంతా వట్టి బుద్ధాయిరకం! పెళ్ళి చేసుకుని సంసారంచేసే ఊహ వచ్చినా, ఓ దుకాణం పెట్టుకుని వ్యాపారం చేసుకోగల ఊహ వచ్చినా వాళ్ళావిషయమే ఆలోచించరు. స్మశానంలో మరదగొండి మొక్కలు, పిచ్చిమొక్కలు పెరిగినట్టు, కుగ్రామపు వీధుల్లో గడ్డి, కలుపుమొక్కలు పెరిగినట్లు రోమ్ నగరపు

సందుగొందుల్లో ఈ దొంగలు పెరిగారు. గౌరవంగా పని చేసుకోడం ఎంత తేలికో వీళ్ళు ఆలోచించిన పాపానపోలేదు. ఈ వెధవపనిలో ఎంతకష్టముందో ఎన్నడూ ఆలోచించి ఎరగరు. సిగరెట్టుచుట్టుకుంటూ తోడిదొంగల సంజ్ఞలకోసరం ఎదురుచూస్తూ నించోడం వారికి విసుగెత్తదు. పెద్దకష్టమనిపించదు. ఇది వెధవపని. అయితేనేం ఇదీ ఒకరకమయిన పనే.

ఇలాంటి పని నాకు విసుగెత్తిస్తుంది. నేను భరించలేను. వంచినకలం ఎత్తకుండా గంటలకొలదీ రాయమంటే రాస్తానుగాని యిలాంటి పనిమాత్రం నేను చెయ్యలేను. కాని వీళ్ళకి ఇలాంటి పాడుజీవితమంటేనే మహాఇష్టం. బాటసారుల దృష్టి నాకర్షించకుండా ఎంతో పనిలో నిమగ్నులయి ఉన్నట్లు నటిస్తారు. వీళ్ళకి ఉత్తమంగా తోచినా మనకి పాడుగా తోచే విషయమేమంటే పెద్దమనుష్యులు, బూర్జువాలు ఈ వీధులవెంట వెడుతూ తమపక్కవారిని దోచుకుంటూంటే తమకేమీపట్టనట్టు ప్రవర్తిస్తారు. ఒకొక్కప్పుడు దొంగలను రక్షిస్తారుకూడా. ఏ హోటలువాణ్ణయినా అడిగిచూడండి. హోటలువాళ్ళకి దొంగలంతా తెలుసు. వాళ్ళంటే భయం కూడా. భయపడడంలో అర్థముంది కాని వాళ్ళని అభిమానించడం క్షమింపరానిది. సాధారణంగా మంగళ్ళకూ, దుకాణాదార్లకూ, హోటలువాళ్ళకి దొంగలంటె సానుభూతి, ఒకవిధమయిన సంబంధం, ప్రేమ ఉంటుంది. రోమ్‌నగరంలోని దొంగలమధ్యఉన్న ఐకమత్యం ఊహాతీతమయింది, అపూర్వమయింది. సైకిలు పోగొట్టుకుని, అలాకాదు, 'ఇనప-చ[illegible]బరు

సు్రాన్ని 'పోగొట్టుకుని గుండె బాదుకుంటూ, జుట్టుపీక్కుంటూ, బిగ్గరగా ఏడుపు మొదలుపెడితే బండివాళ్ళు, కారుడ్రైవర్లు, హోటలువాళ్ళు, దుకాణాదారులు, మంగళ్ళు నవ్వుతారు. వెంటనే లేచి చక్కాపోకపోతే వేళాకోళం చేస్తారు, అవమాని స్తారు. నాల్గుతిట్లతో బయటపడితే అదృష్టవంతులమే. ఇక దొంగో మన ఏడుపులకీ పెడబొబ్బలకీ చలించకుండా నవ్వుతూ, చెలుతూ, తను చేసిన 'ఘనకార్యం' తలుచుకుని సంతోషి స్తుంటాడు.

వెర్లయిన్ మహాకవికి దొంగలంటే మహాఇష్టం. వాళ్లని 'ప్రియమయిన దొంగలు' అనేవాడు. వాళ్ళతోపాటు కొన్నాళ్లు జైల్లో ఉన్నాడు. ఇక హంతకుల్ని 'తియ్య తియ్య'ని వారనేవాడు. అయితే ఇవి యతిప్రాసలకోసం, అలంకారాల కోసం అన్నమాటలేకాని ఇవి వాస్తవంకావు. దొంగలవిష యంలో నేను పక్కా పోలీసుని కావాలనిఉంది. దొంగలతో సహవాసంచేసేనాటికి వెర్లయిన్‌క సైకిలు తొక్కడమేరాదు. కాని సైకిలుతొక్కుతున్న వెర్లయిన్ హాస్య చిత్రంఒకటుంది. దాన్ని చూస్తుంటే ఆరోజుల్లో నేనున్నంతమంది దొంగలు రోమ్‌లో లేరో లేకపోతే ఆనాటి దొంగలు కవులను దయ తలచేవా క్లేమోననిపిస్తుంది. దొంగలకి రొట్టె ఎంతఅవసరమో నాబోటి కవికి సైకిలు అంత అవసరం. రొట్టె వాళ్ళకి శరీర బలం చేకూరిస్తే సైకిలు నాకు ఆత్మబలం చేకూరుస్తుంది. నేననుభవించిన ఆత్మబలం అనుభవించాలంటే నగరసంచారా

లను దాటి, కొన్ని కిలోమీటర్లు, వెళ్ళాలి. ఈ మానవ సంఘంనించి దూరంగా వెళ్ళి తన్మయుణ్ణయి పోవాలంటే నాకు సైకిలు ఎంతో అవసరం.

ఇవాళ ఉదయం మాంటీబజారులో నేను చూచిన దృశ్యం ఎలా మరిచేపోగలను! టైర్లు, ట్యూబులు అమ్మే దొంగవర్తకుల మధ్యనించి హఠాత్తుగా ఒక యువకుడు ప్రత్యక్షమయాడు. అతడు అందగాడు. రక్షణ సైనికునిలాంటి శరీర సౌష్టవం. నేనెన్నడు శరీర సౌందర్యదృష్టితో మను షులకేసి చూడలేదు. కాని అతను గ్రీకు శిలావిగ్రహంలా చూడముచ్చటగా ఉన్నాడు. జుట్టు ఉంగరాలు తిరిగి సినిమా స్టార్స్ జుట్టులాగా బాదంకాయ రంగుగా ఉంది. కళ్ళు కద లాడే నీటివర్ణంలో ఉన్నాయి. చూడడానికి మన్మథుడిలా ఉన్నాడు. అతన్ని చూస్తూ నా యవ్వనాన్ని ఆనాటి నా అందాన్ని తలపోసి విచారించసాగాను. అందుచేత అతనంటే నాకు సానుభూతీ, ఆశ్చర్యం కలిగాయి. సినిమా స్టారులాగా అతను సిల్కుషర్టో, వులెన్‌షర్టో తొడిగాడు. పొడుగాటి లాగూ వేసాడు. అతను పేరుగాంచిన సినిమాయాక్టరని నిశ్చయించుకున్నాను.

నాలో నేను మాట్లాడుకుంటూంటే ఆయువ టైర్లు కొన్నాడు. ఆ టైర్లు అమ్మేవాడూ దొంగే. టైరూ మూడువేల లీరాలధర చెప్పాడు. ఆ యువ కొనబోయే టైర్లను బయటా లోపలా బాగా నడుముకు వేలాడుతున్న తోలుసంచీలోంచి నో

తీశాడు. పదకొండు అయిదువందల నోట్లు లెక్క పెట్టాడు. లెక్క పెట్టడంలో కంగారుపడి చిల్లరనోట్లు తిరిగి లెక్క పెట్టాలని బిగ్గరగా అన్నాడు. ఆ పదకొండునోట్లు జేబులో పెట్టుకోమని ఆ దొంగకి సంజ్ఞచేసి ఎలాగయితేనేం తక్కిన చిల్లరనోట్లు కూడా లెక్క పెట్టిచ్చాడు. ఆ రెండు షర్ట్లూ రెండు బుజాలకీ తగిలించుకుని చక్కటి అల్యూమినం సైకిలెక్కి చక్కాబోయ్యాడు.

ఆ షర్ట్ల అమ్మకందారుని చూదామని నిల్చుండిపోయా. పది నిమిషాలలో ఇంకో జత షర్ట్లను అతను అమ్మేశాడు. ఈజత కొన్నతను వయసు మళ్ళినవాడు. ఎర్రటి మొహం. పీచుజుట్టు. అతను నిశ్చయంగా హోటలు యజమానయి ఉంటాడు. వెయ్యిలీరాలనోట్లు ఇచ్చిఅయిదువందల లీరాలనోటు పుచ్చుకుని వెళ్ళిపోయాడు. నేనూ షర్ట్ల బేరం ఇంకా చూదామని అట్టే ఉండిపోయాను. ఆ చౌకులో నేను నుంచున్న స్థలం మహా అనువుగా ఉంది. అక్కడనించి అంతా కనిపిస్తుంది. నా సైకిలు ఎత్తుకుపోయిన దొంగ ఒంటరిగానో సైకిలుతో స[illegible] ప్రత్యక్షమవుతాడనే భావనాకాహ్లాదం కలిగించింది.

[illegible]ంటి ఆలోచనలలో నేను మునిగిఉండగా ఇందాకటి [illegible]జమాని చేతులు ఊపుకుంటూ చక్కా వచ్చాడు. [illegible]లో ఇందాక షర్ట్లు అమ్మినతను ఇచ్చిన నోటుఉంది. [illegible]ఇది దొంగనోటు! దొంగనోటు! దొంగనోటు [illegible]ంటగట్టావ్!" అంటూ అరవసాగాడు.

"దొంగనోటా ?"

"ఆః-దొంగనోటే! యింతకు ముందేగా నువ్విచ్చింది. యిది దొంగనోటని అప్పుడే అనుకున్నా."

"నీ కెవరిచ్చారో జ్ఞాపక ముందా?" అమ్మకందారు ఆందోళనచెంది "నీ కెవరిచ్చారో నాకేం తెలుసు? నువ్వెక్కడి వాడివి? నీకు నేనేం నోట్లివ్వలేదే! అసలు నేను నీకేపి అమ్మిందే!"

"యేవిటీ? అసలు నాకేపి అమ్మలా" అంటూ మండి పడ్డాడు హోటలుయజమాని. ఇంకేం ఇద్దరూ అచ్చమయిన రోమన్లలాగా ఒకరినొకరు తిట్టిపోసుకోసాగారు. ఇలాంటి దొంగనోట్లు సంచీలో ఇంకేమయినా ఉన్నాయేమో జాగ్రత్తగా వెదకమని హోటలు యజమాని సూచించాడు.

ఆ నోట్లు చూస్తాను ఇలా ఇమ్మన్నాను. నన్ను దోచుకున్నారుకదూ, ఈ దొంగలు నన్నెరుగుదురు. నహోనా బజారులో బొమ్మలు గీస్తుండగా నన్ను వందసార్లు వీళ్ళు చూసుంటారు. అంతేకాదు నా బొమ్మలకి 'మోడలు' కోసరమని వీళ్ళ సందుల్లో తిరుగుతూండగాకూడా నన్ను చూసుంటారు. నేను మోడలుగాతీసుకునే ఆడవారకమంతా నన్నెందుకో ఆకర్షిస్తారు. వాళ్ళ శరీరం నాకుఅసహ్యం గొలుపుతుంది. దేవకన్యలుగా వాళ్ళ నెలా చిత్రిస్తానో, నాకల్పనా ప్రపంచంలోకి వాళ్ళ నెలా తీసుకుపోతానో నాకే తెలియదు.

ఆ హోటలు యజమాని, దొంగ ఇద్దరూకూడా సరేనని ఆ దొంగనోటు నా చేతి కిచ్చారు. ఆ నోటును జాగ్రత్తగా పరిశీలించాను. అచ్చు సరిగాలేదు. గుర్తులు సరిగాలేవు. అది

దొంగనోటని నిర్ధారణ చేశాను. ఈ లోపుగా నా చుట్టూ చేరిన జేబుదొంగలు ఈలలు వేసుకుంటూ ఆ నోటు దొంగనోటని రూఢిపర్చారు. ఇంకేం దొంగలు, దోస్తులు అంతా నవ్వసాగారు. నే నొక్కణ్ణే నవ్వకుండా చివరికి ఏమవు తుందో చూదామని అక్కడే నిలుచుండిపోయాను. ఆ సైగ్ల అమ్మకందారు సంచీలోంచి వసికే చేతుల్తో పది అయిదు వందలలీరాల నోట్లుతీసి చూపించాడు. అవి అంతకుముందు ఆ మన్మథుళ్లాంటి యువకుడు, ఆ గజదొంగ, ఇచ్చినవే.

"పోనిలే"అన్నాడా దొంగ. తోటిదొంగలు నవ్వుతూ వేలుతున్నారు. "యెవరో నా కిచ్చారు. యింకెవరికో నే నిస్తాను. నా కన్నీ నకలే." అంటే అతని దగ్గరఉన్న నోట్లన్నీ మంచివిగాని, దొంగనోట్లుకానీ వంచనవల్ల సంపాదించినవని అతని తాత్పర్యం.

"కాగితం ముక్కలు మంచివయితేనేం, చెడ్డవయి తేనేం." అని వేదాంతం ఒలికిస్తూ నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పు క్షణికమే. దొంగనోటు తీసుకుని మంచినోటు తిరిగిచ్చి యథా ప్రకారం దొంగసైగ్లు అమ్మసాగాడు. తొందరగా వెళ్ళేవాళ్ళకి, మారాన నివసించేవారికీ చిల్లరఇచ్చేటప్పుడు ఈ దొంగనోట్లు జాగ్రతగా తోసేయడం మొదలెట్టాడు.

మర్నాడు పోర్టసీ ఓడరేవు బజారుకి వెళ్దామను కున్నాను. అది ఇక్కడి దొంగల స్థావరాలలోకెల్లా పెద్దది. ఉదయాన్నే ఆరున్నర గంటలకల్లా నిద్రలేచాను. ఆవి సెప్టెం

బరు ఆఖరురోజులు. రోమ్ నగరంలో సెప్టెంబరు నెల బహు రమణీయంగా, నిర్మలంగా, కొంగ్రొత్తగా ఉంటుంది. నిన్న మాంటీబజారులో చాలా మంది నా పెద్దమనిషితరహా, నా దుస్తులతీరు, నా శక్తిసామర్థ్యాలు గ్రహించారు. నన్నిట్టే గుర్తు పట్టగలరు. అందుకని మారువేషం వేసుకున్నాను. కాలర్‌గానీ టైగానీ వేసుకోకుండా మెడకి ఉన్ని రుమాలా చుట్టుకుని దొంగలు వేసుకున్నట్టే ముడి వేసుకున్నాను. ఒకప్పుడు సొగసుగా ఉన్నా వాడకంవల్ల పాతగిలపోయి అతుకులుపడ్డ బూట్లు వేసుకున్నాను. అయితే అచ్చంగా దొంగలాగా ఉన్నానని భ్రమమాత్రం నేను పడలేదు. నావేషం మాయింటి దర్వాన్‌కి జిజ్ఞాస రేకెత్తించింది. నా సైకిలు పోక ముందు నాకు రెండు సైకిళ్ళుండేవి. అదృష్టవంతుణ్ణి! పోయిన సైకిలు వెదికి పట్టుకోడానికి ఇంకో సైకిలు తయారుగాఉంది. ఈ సైకిలు వేసుకుని బయలుదేరి టైబరునది ఒడ్డంబడేపడి అలా అలా తిరిగీ తిరిగి పోర్టెసీబజారు చేరుకున్నాను. అంటే రోమ్ నగరంలో సగభాగం తిరిగానన్నమాట. ఎక్కడా చడీచప్పుడీ లేదు. ఈ సగభాగంలో ప్రజలు రాత్రి తొందరగా పడుకుని ఉదయం ఏ ఎనిమిదిన్నరకో లేస్తారు. ఇదీ మధ్యతరగతి ప్రజలు నివసించే రోమ్‌నగరం. ఇక దొంగల రోమ్‌లో అంతా ఆరు ముప్పావుకే లేచి ఒక ఇరుకువీధిలో గుమిగూడతారు. కొన్ని సంవత్సరాల కితం నా కుక్కను ఎవరో ఎత్తుకుపోయారు. ఇవాళలాగానే ఆ నాడూ ఎంతో ఆదుర్దాతో ఈ పాపిష్టి వీధిలో ప్రవేశించాను.

1938 డిశంబరులో నా కుక్కను దొంగిలించేవరకు రోమ్‌నగర దొంగలు నన్నెంతో మర్యాదగా చూసేవారు. నా కుక్కను ఒక వేటగాడు దొంగిలిస్తే ఆతని స్నేహితుడో రొట్టెలవాడు దాన్ని హొయ్యిలో దాచాడు. ఎలాగయితేనేం కుక్కను పట్టుకున్నాను.

ఆ సమయంలో పోర్టెసీ బజారులోని ఆ వీధిలో జనం తిరుగుతున్నారు. వంతెన కిరువైపులూ ఛోటా దొంగలతో నిండిపోయింది, ఒక సైకిలున్న దొంగలు, రెండు సైకిళ్ళున్న దొంగలు, మూడు సైకిళ్ళున్న దొంగలు, అత్తి, ద్రాక్ష మొదలయిన పళ్లు అమ్మేవాళ్ళతో కలిసిపోయారు. నా సైకిలుకోసరం వెదకడానికి ఆ మందలోకి చేరుకోకమునుపే నన్ను దొంగలు గుర్తు పట్టేస్తారేమోనని నాకు భయంవేసింది. పోర్టెసీ బజారులో ఓ వందమందికంటె ఎక్కువజనం ఉండరని అనుకున్నాను. కాని కనీసం రెండు వేలమందయినా ఉంటారు. నేను దొంగల మధ్యగా మెల్లిగా నడవసాగాను. వాళ్ళు జట్లు జట్లుగా విడిపోయారు. మొదటి జట్టులో ఒకటి రెండు సైకిళ్ళు అమ్మే దొంగలున్నారు. వీళ్ళదగ్గిర సైకిళ్ళన్నీ పాత డొక్కులు. ఎందుకూ పనికిరానివి. కొన్నిటికి టైర్లులేవు. కొన్నిటికి ట్యూబులులేవు. కొన్ని నానా గోత్రేభ్యాగా ఉన్నాయి. వీళ్ళవెనక టైర్లు, ట్యూబులు, విడిభాగాలు అమ్మే వాళ్ళున్నారు. మొదటిజట్టులో మాంటీ బజారులో నాకు కనిపించిన దొంగలు కొందరున్నారు. పూర్వం ఫాసిస్టుసైనికులు ఉపయోగించిన వోల్సిట్ సైకిళ్ళు మూడు ఒకడిదగ్గిర అమ్మకానా

నికి ఉన్నాయి. ఇవి కొత్తవి, గట్టివి. ధర సుమారు పదిహేను వేల లీరాలు. వీటిని అమ్మేవాళ్ళంతా దొంగతనం వృత్తిగా పెట్టుకున్నవాళ్ళో, సైన్యంనుంచి విడుదలయి వచ్చినవాళ్ళో లేకపోతే సైన్యంనుంచి విడుదలయివచ్చి దొంగతనం వృత్తిగా పెట్టుకున్నవాళ్ళో అయివుంటారు.

ఈ దొంగల్లో ఇద్దరు గుండీ బెజ్జాలలో విద్యార్థులు పెట్టుకునే బాడ్జీలు పెట్టుకున్నారు. చెరో సూటుకేసూ పట్టు కొని తిరుగుతూ ఎవరన్నా కావాలంటే సూటుకేసులు తెరిచి నల్లటి జెర్సీకోట్లు, రంగులు అమ్మజూపుతున్నారు.

మొదటి జట్టులోంచి నెలుతుండగా ఆకుపచ్చనిచొక్కా తొడుక్కున్న యువకుడొకడు నన్ను పలకరించాడు. అతను మంచి కండపుష్టిగల మనిషి. పొగరుమోతు. అహంకారి. అమ్మడానికి వచ్చావా, కొంటానికి వచ్చావా అని నన్ను ప్రశ్నించాడు.

"అమ్మటానికే" అని నేను జవాబు చెప్పాను.

మాంటీబజారులో అదివరకే అతను నన్ను చూచాడు. నన్నతనెరుగును. నేనిక్కడికి రావడం తెలుసు. నేను ఏవో వస్తువులు అమ్ముకోడానికి రాలేదనీ పోగొట్టుకున్న సైకిలును వెదికి పట్టుకోడానికి వచ్చాననీ అతనికి తెలుసు. తనకీ విషయా లన్నీ తెలుసునని నాకు తెలియజెప్పడానికే నన్నివిధంగా పలక రించాడు. నాదగ్గిరున్న సైకిలు ఎంతకు అమ్ముతావని అడి గాడు. నన్ను వెర్రివెంగళాయిని చేసి ఆడిద్దామని చూస్తున్నా

డనే విషయం గ్రహించానని అతనికి తెలియజెప్పడానికని సైకిలు ఖరీదు, "ముప్ఫయివేల లీరాలు"అని చెప్పాను.

"యీ సైకిలే నీకెపుడో మళ్ళీ ఆరువేలకి నేను అమ్మక పోతే అదృష్టవంతుడవే అనుకో." అని గొణుగుతూ మెల్లగా జనంలో చేరిపోయాడు. వాడిమాటల కర్థం 'ఈ సైకిలును కూడా కాజేసి దాన్నే తిరిగి ఆరువేలకి నీకే అమ్ముతాం. చూడు'అని.

సైకిలు కాజేసినందుకు నే నింకా మహాచెడ్డకోపంగా ఉన్నానని వాడు గ్రహించేలా ఎందుకు ప్రవర్తించానా అని విచారపడ్డాను. వేళాకోళానికి ఎక్కడలేని ధరాచెప్పాను. అదే నేను చేసిన పొరపాటు. నేను అహంకారానికి పోకుండా మామూలు ధర చెప్పవలిసింది. దొంగలకి కోపం తెప్పించి రెచ్చకొట్టడం వల్లేం లాభంలేదు. ఇదీ నే చేసిన పొరపాటు. దీనికి కారణం ఇలాంటి విషయాలలో నాకు అనుభవం చాలక పోవడమే. ఇదివరలో ఒకమాటు ఇలాగే నా సైకిలొకటి పోతే పట్టుకున్నాను. అంతమాత్రాన నేను దొంగవస్తువులను పట్టుకోవడంలో దిట్టననుకోవడం పొరపాటు. నన్ను పలకరించిన ఆ యువకునితో సౌమ్యంగా మాట్లాడాల్సింది. వాడు దొంగల నాయకుడయి ఉంటాడు. తనిఖీకి వచ్చాడు. బహుశా నిన్న నన్ను బాగా కనిపెట్టిచూసి ఇవాళ సైకిలు వెదకడానికి తప్పకుండా ఇక్కడికి వస్తానని నా కోసం ఎదురుచూస్తూ ఉండి ఉంటాడు.

ఇక సైకిలు దొంగతనాలు అణిచివేయడం గురించీ, పోలీసు నిఘా గురించీ చెబుతా వినండి. ఇవాళ ఆదివారం. మాంటీ బజారులో దొంగలెవరూ ఉండరని విన్నాను. అయినా స్వయంగా చూడ్దామని మాంటీ బజారుమీదుగా బయలుదేరాను. చౌకులో ఒక కాపలాపోలీసు తప్పితే ఎవరూ లేరు. వాడూ దిగాలు పడున్నాడు. తప్ప తాగినట్లుంది. ఒక ఇంటి గుమ్మం మీద కాలానించి నుంచున్నాడు. కిటికీలోంచి ఒక అమ్మాయి మూగసంజ్ఞలు చేస్తూంది. కాస్త తమాషా చేయాలని నిశ్చయించుకున్నాను.

దగ్గిరిసా వెళ్ళి, "గుడ్ మార్నింగ్! దొంగలు అయిపు లేరే?" అన్నాను.

హఠాత్తుగా నేనిలా ప్రశ్నించడంవల్లనో, వేళాకోళం చేస్తున్నానని భావించో అన్నాడు: "యివాళ ఆదివారంగదూ, అంతా పోర్టసీ బజారులో వుంటారు. అదిగో, ఆవైపుగా వెళితే వాళ్ళెక్కడుండేదీ యెవర్ని చూపమన్నా చూపుతారు."

ఇలా జవాబిచ్చినందుకు నాకేం ఆశ్చర్యంకలగలేదు. నిన్న మాంటీ బజారులో దొంగలతోపాటు ఒక సిపాయి నల్లటివానకోటు అమ్ముతూ నాకు కనిపించాడు. ఇంకో సిపాయి నల్లటి మేజోళ్ళు అమ్ముతున్నాడు.

దొంగల నాయకుడు తనిఖీచేసి వెళ్ళిన పదినిమిషాల కల్లా పెద్ద ఆపద సంభవించవలసిందేగాని అదృష్టవశాత్తూ తమాషాగా పరిణమించింది. నేనీ పూటల్లా దొంగలమధ్య తిరగాల్సి ఉంటుందని ఇంటి దగ్గిరనించి బయదేరేట్టప్పుడే

నా డబ్బు సంచీ ఉన్న జేబు మూతికుట్టేశాను. ఒక జేబు దొంగ నా కుడిజేబులో చెయిపెట్టి ఏమీలేకపోయేసరికి కోపం తోనో, తమాషాకో లేక నన్ను హెచ్చరించడానికో జేబు లోపలికుట్టు బయటికి లాగివదిలేశాడు. నాలుగువైపులనించీ, ఎక్కడెక్కడి దొంగలు రానారంభించారు. ఇంకా సరిగా ఏడు కాలేదు. బజారులో తిరగడమే మహాకష్టంగా ఉంది. ఆ జన సమ్మర్దంలో దోవ ఇమ్మని అడిగిప్రయోజనంలేదు. ఎవడికి వాడు తోసుకుంటూ పోవలసిందే. బయటపడడానికి నేను మహాతోసుకు రావలసివచ్చింది. చాలా మంది పోర్టెసీ రేవు కమానుగుండా శిథిలావస్థలోఉన్న బరకాసులకీ, బాగా కిందుగా ఉన్నఇళ్ళకీ మధ్యగాఉన్న ఇరుకువీధిలోకి వెళుతూండడం గమ నించాను. ఈవీధి నదిఒడ్డున అరకిలోమీటరువరకూ వ్యాపించి ఉంది. ఈ వీధి పొడవునా ఇంకా కొందరుసైకిలు దొంగలు, ఎక్కడెక్కడి దొంగవస్తువులు దుప్పట్లు, నారబట్టలు, చేతి పనిముట్లు, పాతబూట్లు, రిబ్బన్లు, ఖాళీడబ్బాలు, పగిలి పోయినకుండలు, పాతపటాలు, చిత్రాలు, పాతపుస్తకాలు అమ్మేవాళ్ళూ గుమిగూడారు. వీళ్ళదగ్గర దుకాణాలలో దొర కని అనేక వస్తువులుకూడా దొరుకుతాయి. ఒక దొంగ మైనపువత్తుల పెట్టెలు, కొయ్య అగ్గిపెట్టెలు అమ్ముతున్నాడు. ఈ అగ్గిపెట్టెలు ఎక్కడ సంపాదించావని వాడిని అడిగాను. పెరూజియానించివచ్చే రైలు ప్రయాణీకులదగ్గిర పుగాకు అగ్గి పెట్టెలు వంద పదిహేనులీరాలచొప్పునకొని ఇరవై అయిదులీరా లకి, ముప్ఫయిలీరాలకీ అమ్ముతున్నానని వాడుజవాబుచెప్పాడు.

ఒక దొంగ ముడి ఉప్పు అమ్ముతున్నాడు. ఇంకో దొంగ రేషన్ కార్డులున్నవాళ్ళకికూడా దొరకని ఆలివ్‌నూనె డబ్బాలకు డబ్బాలుగా బహిరంగంగానే అమ్మేస్తున్నాడు.

ఇక్కడ దరిద్రదేవత తాండవ మాడుతోంది. ప్రజల ముఖాలు పీక్కుపోయి, పాలిపోయి కళాకాంతులు లేకుండా ఉన్నాయి. అంతా పురుగుల్లా ఉన్నారు. ఈదృశ్యంచూస్తూ కవులదృక్పథంతో, వేదాంతుల దృక్పథంతో మానవజాతిని గురించి ఆలోచించసాగాను. నేటి ప్రజలు దరిద్రులేగాని వట్టి జిత్తులమారివాళ్లు, కుశాగ్రబుద్ధులు, ప్రతిభావంతులు. ఎలాగో ఒకలాగ ఆకలిబాధ తీర్చుకుంటున్నారు. నాలాంటి వేదాంతులలాగానే కవులుకూడా దరిద్రులకి శక్తిసామర్థ్యాలు లేవనీ, బూర్జువాలకి వీళ్ళకంటె ఒక్క పిసరయినా తెలివితేటలు ఎక్కువుంటాయని నమ్ముతారా ? ఇక్కడి బీదప్రజలనే తీసుకుందాం. వీళ్ళు బహుజిత్తులమారివాళ్ళు. మనంతటి కుశాగ్రబుద్ధులు. అయితేనేం వీళ్ళ దరిద్రం కాసంతయినా తీరిందా? లేదే! వీళ్ళల్లో ఒకడిని సైకిలుదీపం, డైనమో ఎంతకిస్తావని అడిగాను.

"తొమ్మిదివందలు. దీపం ఖరీదు మూడువందలు. డైనమో ఖరీదు ఆరువందలు. తీసుకోండి. సరిగా పనిచెయ్యకపోతే వాపసు తీసుకురండి. మెదలకుండా మీడబ్బు మీకు తిరిగిచ్చేస్తాను." అన్నాడు.

"ఆ-యింకేమిస్తావులే. నీ దగ్గిరే వుంచుకో." అని నేను చమత్కరించాను.

నాలో నేనిలా తర్కించాను: "నిన్న ఆరులీరాల ఖరీదు చేసే నూనె ఇవ్వాళ ఆరువందలకి అమ్ముతూంటే దీపం, డైన మోల ఖరీదు వందరెట్లు పెరగడం సహజమే."

ఇంకోదొంగ అగ్గిపుల్లలు అమ్మజూపుతున్నాడు. సిగరెట్లు దుకాణంలో రెండులీరాల ఖరీదుచేసేఅగ్గిపెట్టెలు ఇక్కడ ఇరవై అయిదు లీరాలకిగాని దొరకవు. నూరుఅగ్గిపెట్టెల ఖరీదు ఇరవైఅయిదు లీరాలు! ఈ ముక్క వింటే నవ్వొస్తుంది.

ఈ విధంగా ఆలోచిస్తూ లెక్కలేనన్ని దొంగవస్తువులతో కూడిన ఈ 'బలివేదిక'ను, ఈ'రుద్రభూమి'ని సాలోచనగా పరికింపసాగాను.

ఈ వీధిలో కొనేవాళ్ళకంటె దొంగలు, అమ్మేవాళ్ళు ఎక్కువగా కనిపించారు. వీధిచివరికి చేరాను. ఇక్కడితో బజారు ఆఖరు. ఇకపైనంతా చవుటినేల. దీని ఎడమఅంచు వెంబడే చిన్నబాట ఉంది. కాసేపు గాలిలో, వెల్తురులో తిరిగి బడలిక తీర్చుకుందామని బయలుదేరాను. తోవప్రక్కన ఒక చలమదగ్గిర ఒక రైతుబిడ్డ బట్టలు ఆరవేస్తోంది. ఆమెని పలకరించాను. నేనుకూడా దొంగనో, సాదాదుస్తులలో ఉన్న పోలీసునో అనే అనుమానంతో ఆమె నాతో సరిగా మాటాడలేదు.

ఎంతో కష్టంమీద వేలకొలదీ ఉన్న ఆ దొంగల మధ్యనించి తోవ చేసుకుంటూ తిరిగి యథాస్థానానికి వచ్చాను. అమ్మకానికి సైకిళ్లు పెట్టిన స్థలానికి చేరుకోవాలనే కుతూహలం ఎక్కువయింది. ఆ లెక్కలేనన్ని సైకిళ్ళలో

నా సైకిలును పట్టుకోగలననే ఆశ నాకు బలీయమయింది. ఆ సైకిళ్లను పరీక్షగా చూసి, ఒక్కొక్క దానినీ లెక్కపెట్ట నారంభించాను. లెక్కపెట్టీ లెక్కపెట్టీ విసిగెత్తిపోయింది. ఎంత పరీక్షగా చూసినా నాసైకిలు జాడగాని, దొంగజాడగాని పొడగట్టలేదు. ఇంకో సైకిలు కొందామనుకుని బేరం మొదలు పెట్టాను. తెర్లుపోయిన ఒక డొక్కుసైకిలుకి రంగుపూసి ఏడు వేల లీరాలకు ఒకదొంగ అమ్మేశాడు. బియాంచీ సైకిలొకటి ఇరవైవేలకి అమ్ముడయింది. దొంగల గుంపులో ఒకపిల్లవాడు కనిపించాడు. వాడిదగ్గర ఒక క్రొత్తసైకిలు అమ్మకానికుంది. క్రోముప్లేటుతో, మడ్గార్డులతో, దీపంతో, బ్రేకులతో ఆసైకిలు తళతళా మెరసిపోతోంది. తెర్లు, ఫ్రేము సరిక్రొత్తవి. "సరికొత్త సైకిలు, సరికొత్తసైకిలు!" అని నత్తిగా అరుస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాడాపిల్లవాడు. నేనతనిదగ్గరికివెళ్ళి సైకిలు ఎత్తిచూసాను. పెడలు తిప్పాను. గొలుసు తేలికగా తిరిగింది. ధ్వని వినసొంపుగా ఉంది. బలేసైకిలు! ముచ్చటేసింది. ఈ సైకిలు పద్ధెనిమిదివేలు చెప్పాడు. రెండురోజులబట్టి అమ్మకం దార్లు, కొనుగోలుదార్లు మధ్య చర్చలు విన్నానేమో ఈ ధర సరసంగానే ఉందనిపించింది. అయినా అడిగి చూదామని పన్నెండువేలకి అడిగాను.

"యేవిటి! యేవిటి!" అంటూ ప్రారంభించాడు నత్తి కుర్రాడు." యిదేం యెత్తుకొచ్చిన సైకిలు కాదే! యింతకు ముందే పధ్నాలుగు వేలకి అడిగారు. నేనివ్వలేను."

ఇక లాభంలేదనుకుని ఆ కుర్రాడు నను వదలిపెట్టిపోయి కలం, కాగితం పైకితీశాను. ఈ నత్తికుర్రాడు తక్కినవాళ్ళ కంటె అమ్మకంలో దిట్ట అని నాకు తోచింది. బహుశా ఇతను ఎప్పుడోగాని దొంగతనంచేయని శాపతు అనుకుంటా. నా అంతరాత్మతో, నాలో నేను తర్కించుకున్నాను. దొంగ వస్తువు కొనవచ్చా? అలా కొనడం దొంగను ప్రోత్సహించి నట్లుకాదా? దొంగవస్తువుకొంటే కొన్నవానిని చట్టం శిక్షించదా? చట్టం! ఈ రోజులలో ఆ చట్టం ఏమయిపోయింది? పోనీ, మామూలు బజారులో సైకిలు బేరంచేసిచూడు. ఏ దుకాణానికివెళ్ళి అడిగినా అసలు సైకిళ్ళే తమ దగ్గరలేవంటారు. ఆ దుకాణాలలో దొరికేవల్లా ఎందుకూపనికిరాని సరేసు ట్యూబులు, తాతలనాటి తరహా పంపులు. ఈ దుకాణాదార్లుగూడా సైకిళ్ళు కావాలంటే దొంగ బజారు వెళ్ళమని సలహా ఇస్తారు. ఇష్టం ఉండో లేకో వీళ్ళే మాంటీబజారుకీ, పోర్టెసీబజారుకి సైకిళ్ళు సరఫరా చేస్తుంటారు. పూర్వం ప్రతి రాత్రి సైకిలు దొంగతనాలు జరిగేవి. సైకిలు షాపుల్లోపడి దొంగలు లూటీచేసేవారు. ఇప్పుడదంతా ఆగిపోయింది. దుకాణాలలో సైకిళ్ళుంటూలేవు. దొంగలు ఎత్తుకుపోయినవిపోగా మిగిలినవాటిని దుకాణాదార్లు నేలమాళిగలలో దాచేశారు. జర్మన్లు రోమ్ నగరాన్ని ఆక్రమించుకున్న రోజులలో వెయ్యి లీరాల ధరకట్టి జర్మన్లే బలవంతాన సైకిళ్ళు తీసుకు చక్కాబోయేవాళ్ళు. ఒకొక్కప్పుడు డబ్బివ్వకుండా ఎగవేయడం కూడా కద్దు. అందుకని నాటినించీ దుకాణాదార్లు సైకిళ్ళు

దాచేసి దొంగలతోను, దొంగవర్తకులతోనూ వ్యాపారం సాగిస్తున్నారు. కొత్త సైకిలు పదివేల లీరాలకు కొని దొంగవర్తకులు వాటిని అమ్మి ఇరవైవేలు చేసుకుంటున్నారు. ఈ పరిస్థితుల్లో అంతరాత్మ ఒప్పుకోవడంలేదని కూచ్చుంటే ప్రయోజనమేమిటి? నాకు సైకిలు ఎంతో అవసరం. సైకిళ్ళు అమ్మేదల్లా దొంగలు, దొంగ వర్తకులు. కాని హఠాత్తుగా ఒక రోజున టైర్లు, మర్నాడు ట్యూబులు కరువయి పోయాయి. ధరలు చుక్కలకంటాయి. యుద్ధం ముగిసిన వెంటనే ధరలు తగ్గుతాయనే ఆశకూడా కనిపించడంలేదు.

1944 సెప్టెంబరు 28న పోగొట్టుకున్న సైకిలు నష్టం ఎలాగయినా పూడ్చుకోవాలనుకున్నాను. పది సైకిళ్ళుకొని, రెండునెలలపాటు ఆగి మళ్ళీ అమ్మితే బాగాలాభం తియ్యొచ్చునితోచింది. వ్యాపారం ఎలా నడుస్తోందో గ్రహించాను. నేను మాత్రం వ్యాపారం ఎందుకు చెయ్యకూడదు? కాని ఇందులో పెద్ద చిక్కుంది. వ్యాపారవిషయాలలో నాకు సులువు బెళువులు తెలియవు. ముక్కుకుసూటిగా పోతాను.

నేనెన్నడూ వ్యాపారంలోకి దిగుదామనుకోలేదు. మానవుడికి ఈ ప్రపంచం ఒక మజలీలాంటిది. అందుచేత లౌకిక విషయాలలో నిమగ్నుడవడం భావ్యంకాదు. కవి అయినవాడు ధ్యానంలో నిమగ్నం కావడం, పరిశీలించడం, మానవ జీవితం లోని అధమ విషయాలను సహితం కవితా వస్తువుగా స్వీకరించడం ఉత్తమం.

అంటే దొంగ కావడంకన్నా, దొంగవస్తువు కావడం కన్నా దరిద్రంతో బాధపడుతూ, దరిద్రుడుగానే ఉండిపోతూ, దరిద్రుడిగా జీవిస్తూ కవిత్వం రాసుకోవడం ఉత్తమమని నాకు తోచింది. సరే, బాగానే ఉంది. కాని ప్రస్తుతం నాకు సైకిలు కావాలి. ఇపుడున్న ఈ సైకిలునుకూడా కొట్టేస్తే నేనేం చెయ్యాలి? రెండుకాళ్ళబండిమీద స్వారిచెయ్యాలా? ప్రతిరోజూ కొన్ని గంటలసేపు నగరంబయటికి దూరంగా వెళ్ళి పొలాలలో గడపడం నా శారీరక, మానసిక ఆరోగ్యానికి రక్షణ.

మొన్న పోగొట్టుకున్న సైకిలుకంటె ఇంకా చక్కని సైకిలు కొనాలని నిశ్చయించుకుని బేరం చేయడం మొదలు పెట్టాను. నేను మంచి బేరగాణ్ణేగాని, అసలు బేరం చెయ్యాలనే బుద్ధి పుట్టదు. అమ్మకందార్లను మెత్తపడేటట్లు చెయ్యగలను. కాని "అబ్బో! పద్దెనిమది వేలే!" అంటూ నేను మొదలుపెట్టలేదు. "యేమంత పెద్దధర కాదుగాని, నా దగ్గిర పదిహేనువేలే వున్నాయి." అంటూ జేబూకుట్టు ఊడదీసి పదిహేను పెద్దనోట్లు పైకి తీసాను. దొంగలు వేయి లీరాల నోట్లంటె పడిచస్తారు. డబ్బు కంటపడితే వాళ్ళకి ఒళ్ళు తెలియదు. వాళ్ళకి స్త్రీ వ్యామోహం పెద్దగా ఉండదు. మంచి తిండి తినాలని ఆపేక్ష ఉండదు. దొంగతనం ఉంటే చాలు. దొంగతనంలో వాళ్ళకి మహదానందం ఉంది. వాళ్ళ ప్రవృత్తే అది.

ఇక అసలుకథకి వద్దాం. ఆ కుర్రదొంగ నన్ను రహస్యంగా కనిపెట్టి చూస్తున్నాడు. అతనిచూపు మహాతీక్షణంగా ఉంది. నాకేసి తేరిపారజూసేసరికి 'కళ్ళు నెప్పులు పుడుతున్నాయా?' అని మొహంమీదనే అడిగేశాను. దానిమీద ఈ కిందికథ చెప్పాడు. 'బొలోనా బజారుసమీపంలో ఒకమాటు అమెరికావాళ్లు బాంబులు వేశారు. ఒక బాంబుపేలి మాఇల్లు కూలి గోడ నామీద పడింది. శ్వాస సరిగా ఆడలేదు. ఎలాగో చావు తప్పింది. చావు తప్పిందేకాని ఆ అనుభవంతో హడిలిపోయి పది పదిహేను రోజులవరకు నోటమాట రాలేదు. కళ్లు సరిగా కనిపించలేదు. కాస్త తేరుకున్నాక నత్తి ఏర్పడింది. కళ్ళవెంట నీరు కారడం ప్రారంభించింది. మధ్యమధ్య చూపు బెదిరిపోతుంది. ఒకొక్కప్పుడు బాగానే కనిపిస్తుంది. మరొక్కప్పుడు అసలు కనిపించనే కనిపించదు.'

"అదృష్టవంతుడివి. యింకా నయం కళ్లుకాస్తా పోలేదు." అన్నాను.

ఆ తరువాత మా ఇద్దరికీ జోస్తీ ఏర్పడింది. సైకిళ్ళకథ ఒకటి చెప్పాడు. వాడికో దుకాణం (కోతలు!) ఉందట. అది పడిపోతే ఆ రబ్బీసు కిందనించి మూడు సైకిళ్ళు అతికష్టం మీదికి పైకి లాగారట. వాడు చెప్పిందంతా గుదిగుచ్చి ఒక ఆకారానికి తెచ్చాను. అందులో నూటికితొంభైతొమ్మిదిపాళ్ళు నిజం. విమానదాడులవల్ల వాడు, వాడికుటుంబం నిరాధారులయిపోయారు. కిందిభాగంలో సైకిలుదుకాణం ఉంది. ఇల్లు కూలి ఆ దుకాణదారు చచ్చిపోయాడు. నాటినించీ ఈ కుర్ర

దొంగ కూలిపోయిన ఇళ్ళు లూటీచేయడం ప్రారంభించారు. వీడికేగనక సైకిలుదుకాణమంటూ ఉన్నా, వీడు మెకానిక్కు అయిఉన్నా దీపం, డైనమో లేకుండా సరికొత్త సైకిలును అమ్మడానికి తెచ్చేవాడేకాదు. సైకిలు మెకానిక్కులు మహ చెడ్డతెలివిగలవాళ్ళు. దీపమో, డైనమో, గంటో లేకపోతే సరయినధర పలకదని చెప్పి అన్నీ అమర్చిన సైకిళ్ళనే అమ్మ జూపుతారు. దీపం, డైనమో లేవు కాబట్టి నేను అడిగినధర సవ్యమయిందేనని వాటికి డొంకతిరుగుడు మార్గాన నచ్చ చెప్పాను. వాడూ దిగివచ్చాడు. ఇంకేం ఇద్దరమూ బేరంలో కుస్తీ పట్టాం. దొంగలు వట్టి పేరాసముండావాళ్ళు. పదిహేను వేల అయిదువందలకీ ససేమిరా తగ్గనన్నాడు. దానిమీద నేను కొత్తవెత్తు ఎత్తాను. కాసేపు బాతాఖానీ కొట్టి రాజకీయాలు మాట్లాడడం ప్రారంభించాను. దొంగలికి స్త్రీ సంపర్కం, తాగుడు మొదలయినవి తక్కువనీ, వాళ్ళు పెట్టుబడిదారీ విధానానికి బద్ధశత్రువులనీ, 'వ్యక్తిగత ఆస్తి సంపాదించడం దొంగతనంకింద లెక్కే' అనే సిద్ధాంతాన్ని తీవ్రంగా బలపర్చేవారని అనుకునేవాడిని. కాని నా అంచనాలు తలకిందులయాయి.

దొంగలకి దొంగతనంలోనే తప్ప రాజకీయాలలో ఏమాత్రం ఆసక్తి ఉండదు. అందువల్ల ఈదొంగకి జర్మన్లంటే అభిమానమో, మిత్రరాజ్యాలంటే అభిమానమో తెలుసుకోలేకపోయాను. ఒకలిప్తపాటుకాలం ఇతను అరాచకవాది అని అనుకున్నాను. కాని అదీ పొరపాటే. దొంగలకి జర్మనీ

వాళ్ళూ ఒకటే, మిత్రరాజ్యాలవాళ్ళూ ఒకటే, కమ్యూనిష్టులూ ఒకటే. వీళ్ళకి కావలసిందల్లా ఒక్కదొంగతనమే ! కష్టపడి పనిచెయ్యడం వీళ్ళకి గిట్టదు.

దొంగలు ఏంచేస్తూంటారు? దొంగతనానికి బయలుదేరని వేళలు ఎలాగడుపుతారు ? ఇదీ నా జిజ్ఞాస. కవులు, కళాకారులు, రచయితలలాగానే వీళ్ళూ తీరుబడి సమయాలలో బహుశా దొంగతనంలోని కిటుకులు నేర్చుకుంటూ, ఒకళ్ళకొకళ్ళు బోధించుకుంటూ, ఇతర దొంగలసహస కృత్యాలను, దొంగతనాలను మహాఆసక్తితో అధ్యయనం చేస్తూ, ఒకళ్ళని చూచి ఒకళ్ళు ఈర్ష్యపడుతూ ఉంటారనుకుంటా. మనం మట్టుకు ఏంచేస్తున్నాం? ఒకళ్ళనొకళ్ళం విమర్శించుకుంటూ ప్రజలకి లోకువ అయిపోతున్నాం. చివరికి ఎలాగయితేనేం నా పుణ్యంవుచ్చి ఆ దొంగ ఒక నిర్ధారణకి వచ్చాడు. ఇంకో దొంగ, బహుశా దొంగవర్తకుడు కావచ్చు, మా దగ్గిరికి వచ్చి నేను కొంటానన్న సైకిలు తనుకొంటానని సిద్ధమయాడు. మంచిగా మాట్లాడుతూ నన్ను అక్కడినించి తరిమేయాలని చూచాడు. కొత్తబేరగాళ్ళెవరన్నా వచ్చి బేరం కుదుర్చుకోబోతుంటే తను కొంటానని మొదలుపెట్టేవాడు.

"యెంతకావాలి ? పద్ధెనిమిదివేలా ? నీకేమన్నా మతిపోయిందా? మాంచి బియాంచీ సైకిలు నిన్న పదిహేనువేలకి అమ్ముడుపోయింది. దానికంటె నీ సైకిలు యెక్కువేవిటో చెప్పు? క్రోంప్లేటా? దాంతో చచ్చేచావు. తడితగలకుండా చూడాలి. రోజూ! శుభ్రంచేయ్యాలి. లేకపోతే నాలుగు

రోజుల పట్టపగలు. ఈ భాగ్యానికి పదిహేనువేలు పెడు తున్నావా? భేష్! యెంత తలమాసినవాడయినా పదమూడు వేలకన్నా యెక్కువ పెట్టడు."

అంటే తలమాసినవాడు (వీడుకూడా తలమాసినరకమే) పదమూడువేలు పెడతాడన్నమాట. వీడికి ఈ సైకిలుమీద మోజుపుట్టినట్టుంది. దీనినిబట్టి ఈ సైకిలు పదహారు వేలకి తక్కువ చెయ్యదని నాకు తోచింది. ఆ కుర్రాడు నన్ను చాటుకుపిలిచి పదిహేనువేలకి సైకిలు ఇచ్చేస్తానన్నాడు. సరే నని సైకిలు కొనేశాను. నాబస చాలాదూరం. ఒక్కణ్ణేఅంత దూరం రెండు సైకిళ్ళు తీసుకుపోలేను. ఒకదానిమీద ఆ కుర్రాణ్ణి ఎక్కమన్నాను.

ఒస్లేవియా రోడ్డులో ఇరవయిఏడు నెంబరు ఇంటి గేటుదగ్గిరికి వచ్చాం. నేనుండేది ముప్ఫయిఏడు నెంబరు ఇంట్లో. నా ఇంటి ఆచూకీ వాడికి తెలియనీయడం మంచిది కాదనుకుని డబ్బిచ్చి పంపించివేశాను. నా సైకిలును ఏడో అంతస్థుకి తీసుకువెళ్ళి నా స్టుడియోలో పెట్టి తాళం వేశాను. నా సైకిలు అపహరించినదొంగను పట్టుకోగలననే ఆశ. నాకింకా చావలేదు. అందుకని దూరాన్ని లక్ష్యంచెయ్యకుండా మళ్ళీ బయలుదేరి పోర్టసీబజారు చేరుకున్నాను. అప్పటికి పదిన్నర అయింది. జనసమ్మర్దం తగ్గలేదు. వాళ్ళని తోసుకుపోవడం మహాకష్టమయింది.

ఎంతో కష్టమీద జనంగుండా తోవచేసుకుని లోపల ప్రవేశించాను. బేరగాళ్లమధ్య పెద్ద మనుష్యుల్లాంటివాళ్ళు

కొందరు కనిపించారు. వాళ్ళ ప్రశ్నలలోని సౌమ్యతనుబట్టి ఇట్టే వాళ్ళు పెద్దమనుషులని కనిపెట్టేయవచ్చు. అందులో ఒకడు పుగాకుకోసం వెదుకుతున్నాడు. ఎండిన బీటుఆకుల పొట్లం ఒక చిల్లరవర్తకుడు అమ్మజూపాడు. ఎండు బీటుఆకు లను పుగాకులాగా కనిపించేటట్టు చెయ్యొచ్చు.

"యిది పుగాకేనా?" అని ఆ పెద్దమనిషి ప్రశ్నించాడు. పెద్దమనిషితోనో లేక తెలివితక్కువ దద్దమ్మతోనో వ్యవహ రిస్తున్నానని ఆ దొంగకి తెలుసు. అయినా ధోరణి మార్చుకో లేదు. ఆ పెద్దమనిషి తెలివితక్కువగా 'యిది పుగాకేనా?' అని పక్కవాళ్లని అడిగాడు. అతని తెలివితక్కువతనాన్ని కనిపెట్టి ఇదే అదననుకుని పుగాకు కిలోగ్రాం ఖరీదు ఏడు వందలని చెప్పాడు దొంగ. కాని ఇంతకు పూర్వమే అయిదు వందలకి ఇచ్చేయడానికి సిద్ధమయ్యాడు. అడిగినంత ధరా ఇచ్చి దొంగ సరుకులుకొనే తెలివితక్కువ మొద్దులమూలకంగానే ధరలు ఊరికే పెరిగిపోతాయని నేనపుడు గుర్తించాను.

చుట్టూచూచాను. కాని నా సైకిలు జాడగాని, దొంగ జాడగాని తెలియలేదు. నా సైకిలును ఈ పాటికే ఏభాగాని కాభాగం ఊడగొట్టి ఉంటారని ఊహించి చక్రాలు, పెడళ్ళు పరీక్షగా చూస్తూ రెండు గంటలు గడిపాను. కాని ప్రయోజనం లేకపోయింది.

ఇలా పరీక్షించడంలో నేను మునిగిఉండగా ఒక దొంగ చుట్టూ జనాన్ని లక్ష్యపెట్టకుండా నిప్పురంగు సైకిలు నొక

దానిని ఊడగొట్టి ఆకారం మార్చేస్తున్నాడు. నెంబరు, కంపెని పేరు గీకేసేశాడు.

ఇంతలో ఆరుగురు బ్రిటిష్ పార్లమెంటు సభ్యులు పోలీసుగార్డులను వెంటేసుకుని మిలిటరీ ట్రక్కులో చక్కా వచ్చారు. వారి నవ్వుమొహాలూ, వారి కాయపుష్టి చూసేసరికి జనంలో అలజడి బయలుదేరింది. అమెరికా సేనకిచెందిన బూట్లు అమ్మజూపుతున్న ఒక దౌర్భాగుణ్ణి అరెస్టుచేసి ట్రక్కులో ఎక్కించుకుని తీసుకుపొయ్యారు. పాపం! ఆ బూట్లని వాడు అమెరికా సిపాయిదగ్గరనించి దొంగిలించాడో, దొంగవర్తకుడి భార్యకో కూతురికో ఏ స్త్రీగోసిపాయిమో ఇచ్చాడో, ఏదో జరిగిఉంటుంది. ఇక దొంగలో ? విరాగులు, వేదాంతులు, నోరు మెదపలేదు. ఒకళ్ళనొకళ్ళు "యేంజరిగింది?" అని మాత్రం ప్రశ్నించుకున్నారు. "అమెరికా బూట్లు అమ్ముతున్నాడు." అని మాత్రం జవాబు. అంతే. మళ్ళీ ఎవరి గొడవలో వాళ్ళుపడ్డారు. ఒకనాడు మిత్రరాజ్యాధికారులు పోర్టెసీబజారుకు వచ్చి కొంతమంది దొంగలని అరెస్టు చేశారని నిన్ననే ఒక పోలీసు నాతోచెప్పాడు. గొడవేం జరగలేదు. కిమ్మనకుండా దొంగలు సామాను తొందరతొందరగా సర్దుకుని ఉడాయించారు. ఆ దృశ్యం నాకంటపడితే ఎంత నవ్వొచ్చేదో! అయిదు వేలమంది దొంగలని పట్టాలంటే కనీసం ఇరవయి వేలమంది సిపాయిలయినా కావాలి. ఈ అయిదు వేలమందిని ఎక్కడ పెడతారు? జైళ్ళు ఇదివరకే దొంగలతో నిండిపోయాయి. వారంవారం దాడిచేసి తడవకి కొద్ది మంది

దొంగలని పట్టుకుపోతేమంచిది. అరెస్టుచేసి కఠిన వరకం విధించి, అందరు నేరస్తులతోపాటు వీళ్ళనీ ఏదీవులకో పంపిం చేయాలి. అక్కడ ఒకళ్ళనొకళ్ళు దోచుకుంటూంటే, అప్పుడు దొంగతనమంటే ఏమిటో, దొంగిలింపబడ్డవాడు పడేబాధే మిటో వీళ్ళకి తెలిసొస్తుంది. ఆ దీవిలో తిండిపెట్టకుండా వీళ్ళని మాడ్చేయ్యాలి. అప్పుడేమన్నా వీళ్ళు కష్టపడి పనిచేయడం ప్రారంభిస్తారేమో? అయితే అక్కడ కష్టపడి పనిచెయ్యడ మంటే సముద్రంలోనించి చేపలను, భూమిలోనించి వేళ్ళను, మొక్కలను దొంగిలించడమేగా!

సైకిలు ఆచూకీ తెలియకపోవడంవల్ల నిజానికి నాకేం నిరుత్సాహం కలగలేదు. కాని నిరుత్సాహంకలిగే ప్రమాదం లేకపోలేదు. కాస్త హుషారు తెచ్చుకుందామని నలుమూలలా తిరగసాగాను. ఇలా తిరుగుతూండగా గుహల్లాంటి రెండు చిన్న సైకిలు షాపులు నా కంటబడ్డాయి. ఒకదానిమీద ఇత్తడి రంగులో "సైకిళ్ళు రిపేరు చెయ్యబడును. ఊడదీయబడును." అని రాసిఉంది. దీనిఅర్థం, "దొంగలకుసహాయంచేయబడును." అని. లోపల నలుగురయిదుగురు యువకులు ఒక సైకిలును ఏ భాగాని కాభాగం ఊడగొట్టి తిరిగి అమరుస్తున్నారు. అంటే బేరగాళ్ళను మోసగిస్తున్నారన్నమాట. వాళ్ళవాలకమే అను మానం కలిగిస్తోంది. నేను లోపలికివెళ్ళాను. ఒక్కడూ బెదర లేదు. పైగా నన్ను చూడనట్టే నటించారు. సైకిలు పోగొట్టు కుని వెదకడానికి మామూలుగా వచ్చేవారిలాంటి వాడినని వాళ్ళిట్టే కనిపెట్టేశారు.

నేనూ వాళ్ళలాగానే ప్రశాంతంగా నిర్లక్ష్యంగా అక్కడున్న సైకిళ్ళను పరీక్షగా చూడసాగాను. అందులో ఒకడు నీకెలురంగు సైకిలికి ఎర్రరంగు పూస్తున్నాడు. ఇంకొకడు సైకిలు ఫ్రేము సొట్టసరిచేస్తున్నాడు. ఈపనికి చాలా నేర్పు అవసరం. మరొకడు ఇంకో సైకిలికి మడ్గార్డుమార్చేస్తున్నాడు. నాల్గో వాడు దుకాణం వెనక ఒక హాండిల్ బారుని వేడిచేసి మెలి తిప్పేస్తున్నాడు. అది తాతలనాటిది. ఎద్దుకొమ్ములాగా ఉంది. రెండుచివరలా కాస్తకాస్త ముక్కలువిరిచేసాడు. మామూలు మడ్గారు అయిపోయింది. ఇంతేకాదు. వీళ్ళు సామాన్యమయిన తెలివితేటలు గలవాళ్ళుకారు. ట్యూబులుకూడా గుర్తుపట్టకుండా అతుకులు మార్చేస్తారు. ఒకే కంపెనీ డైనమో, దీపాలను ఇంకో కంపెనీవాటితో మార్చేస్తారు. ఒక కంపెనీ డైనమోకి ఇంకో కంపెనీదీపం తగిలిస్తారు. నెంబర్లు గీకేస్తారు. ఇక టైర్లు: టైర్ల విషయం చిక్కు సమస్యే. కాని వాళ్ళదగ్గిర పదేళ్ళనాటి టైర్లు ఉంటాయి. కొత్తవితీసేసి ఆ పాతవివేసి కొత్తవాటిని దాచేస్తారు. పెడళ్ళ అంచులు గీకేసి గుర్తుపట్టకుండా చేస్తారు. ఈ విధంగా రంగు, హాండిలుబారు, పెడలు మార్చింతర్వాత సైకిలును గుర్తుపట్టడం ఎవరితరం!

బాలెగెల్లా రోడ్డులో ఇంకా దారుణం. ఒక సైకిలు అమ్మకందారు నామీద మండిపడి కొట్టబోయాడు. నా సైకిలు పోయిందనీ, ప్రతి దుకాణానికీ వెళ్ళి దొంగను పట్టుకునేందుకు నా సైకిలు నెంబరు ఇస్తున్నానని చెప్పాను. నా

సైకిలు అతనికొట్టుకు వచ్చేఉంటే దాన్ని పట్టుకొని అట్టే ఉంచన్నాఉంచాలి లేకపోతే గుర్తు పట్టకుండా చేసుండాలి.

"సరే, లోపలికి వచ్చిచూసుకో. నీ సైకిలుమాత్రం బయటే అట్టేపెట్టు. నాకొట్టు చాలా యిరుకు." అన్నాడు.

దుకాణం బయట నలుగురయిదుగురు యువకులు తచ్చాడుతున్నారు. వాళ్ళవాలకమే దొంగలవాలకంగా ఉంది. ఏంచెయ్యాలి? పక్క హోటలు యజమానిని పదినిమిషాలసేపు నా సైకిలు చూస్తూ ఉండమన్నాను. ఊహుఁ-వాడు ఒప్పుకో లేదు. కొంచెంపైన ఒక రంగరి ముసలమ్మఉంటే ఆమెని ఒప్పించి సైకిలు దిగవిడిచి తిరిగివచ్చాను. దుకాణాదారు నామీద మండిపడ్డాడు.

"నేను దొంగలతో చేతులుకలుపుతున్నాననేగా నీ వుద్దేశం. అసలు నువ్వే దొంగవి! నువ్వెవరివో నాకేం తెలుసు? నీ గుర్తుకార్డు చూపించు."

అతి వినయ విధేయతలతో కార్డు చూపించాను. అతని ధూకుడు, మంట చల్లారలేదు. సరిగ్గా ఆ సమయానికి ఒక పోలీసు నా కంటబడ్డాడు. కర్మంకాలి వాడి సహాయం కోరాను. తాను డ్యూటీమీద లేననీ ఏదో పనుండి ఆవైపుగా వెళుతున్నాననీ వంకచెప్పి చక్కాబోయాడు. శాంతి భద్రతలు కాపాడవలసిన పోలీసులకి ప్రభుత్వం అతి స్వల్ప జీతాలిస్తోంది. ఆ స్వల్ప జీతంతో సంసారం గడుస్తుందా? అందుకని ఏదో విధంగా సంపాదించి సంసారం గడపడంమీదే ధ్యాసపెట్టు కుని అసలు పని ఎగేస్తున్నారు. ఇక దుకాణాదారు నేనేమో

తనని అవమానపర్చానని మండిపడుతూ నన్ను తిట్టిపోయడం మొదలుపెట్టాడు.

నేను అతనిని శాంతపర్చాలని చూచాను. కాని లాభంలేకపొయ్యేసరికి నాకూ కోపంవచ్చింది. అతనిలాగా తిట్లకి దిగకుండా అన్నాను:

"యెందుకీ రభస? నేను నిన్నేంచెయ్యలేదే! సైకిలు పోగొట్టుకుంది నేనుగాని నువ్వుకాదే! నీబోటి పెద్ద మనుషులు దొంగనిపట్టుకోవడంలో నాకు సాయపడవలసిందిపోయి యేవిటీ గలభా?"

అతనింకా మండిపడుతూ, "యేవిటి! నేను పెద్దమనిషి కాదంటావ్? చూడు, యేంజేస్తానో!" అని నానా తిట్లు తిట్టాడు. దారిబోయేవారి సాయంతో ఎట్లాగయితేనేం అతన్ని శాంతపర్చాను. అతను కొడతాడనే భయం నాకులేదు. కాని యేమో యేంచెప్పగలం? అతనిచేత దెబ్బతినడంకంటె తిరిగీ అతన్ని కొట్టడం ఎక్కువ అవమానకరమని నాకు తోచింది.

ముసలమ్మ దగ్గిరినించి సైకిలు తీసుకుని మళ్ళీ పోర్టసీ బజారుచేరుకున్నాను. మధ్యాహ్నమయింది. ఊరికే తిరగ సాగాను. అక్కడున్న అయిదువందల సైకిళ్ళల్లో నా సైకిలు లాంటి వాటన్నిటినీ పరీక్షగా చూసాను. కాని ... లో నా సైకిలులేదు. నా కళ్ళముందరే నా సైకిలును దొంగిలించిన దృశ్యం జ్ఞాపకం చేసుకున్నాను. బజారులో ఆ సహా

యంలో ఎవరెవరున్నదీ స్మృతికి తెచ్చుకున్నాను. ఎవరు వాళ్ళు? బండివాళ్ళు, రైల్వే కూలీలు.

పాంపే బజారులో దినస్తమానం నాలుగయిదు గుర్ర బ్బళ్లు ఉంటాయి. ప్రతిబండిలో ముగ్గురు నలుగురు కూలీలు కులాసాగా పొగతాగుతూ కూర్చున్నారు. అందులో ఒకడు అచ్చంగా నా సైకిలు కాజేసిన దొంగలాగానే ఉన్నాడు. వాడి ముఖం ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపకమే!

ఆ దొంగవైపుకు అడుగు వేశానోలేదో ఒక లిప్త కాలంలో వాడు అమాంతంగా సైకిలుమీదికి దూకి తప్పించుకు పారిపోయాడు. వాడి తోడిదొంగలుకూడా సైకిళ్ళమీద వాడివెంట పడ్డారు. ఇద్దరుమాత్రం నను పలకరించి వెనకాల సైకిళ్ళమీద వెళ్ళినవాళ్లు దొంగను పట్టుకు తీసుకువస్తారే గాని తప్పించుకోనియ్యరనీ అనవసరంగా గొడవ చెయ్యొద్దనీ చెప్పారు. అక్కడున్న రైల్వే కూలీలు ఒకడూ కదలలేదు. ఆ దొంగ వీళ్ల స్నేహితుడయినా అయిఉండాలి లేకపోతే వాళ్ళల్లో ఒకడి కొడుకయినా అయిఉండాలి.

వాళ్ళల్లో ఒకడు మూడుమూర్తులా పారిపోయిన దొంగల్లే ఉన్నాడు. బహుశా వీడు ఆ దొంగకి తండ్రిఅయి ఉంటాడు. నా దగ్గిరికి వచ్చి "దొంగ పట్టుబడ్డాడా? యేవైపుకి పారిపొయ్యాడు?" అని ప్రశ్నించాడు.

మనిషి కళ్ళల్లో హృదయం గోచరిస్తుందంటారు. నా అనుభవంలో ఇది సత్యమనే భావం కలిగింది. ఆ కూలీ కళ్లనుబట్టి నా సైకిలు కొట్టేసింది వీడి కొడుకేనని స్పష్ట

మయింది. ఈ విషయం తనకేమీ పట్టనట్టుగా ప్రవర్తించాలని వాడు చూచాడు గాని లాభం లేకపోయింది. నేరస్తుని లాగా ఎంతసేపూ కిందికే చూస్తున్నాడు. బండికి ఆనుకుని అరచేతులు బుగ్గలమీద పెట్టుకుని నిల్చున్నాడు. ఇక నేను చేసేదేం లేక అక్కడనించి కదిలి వంతెన మొదట్లో నిల్చుని పోస్టాఫీసుబజారునించి వచ్చేపోయేవాళ్ళని చూస్తున్నాను· అప్పటికి ఒంటిగంటన్నర అయింది. తిండి తినలేదు. నీరసం వచ్చేసింది. అయితేనేం పట్టుదలతో నిల్చుని వచ్చేపోయే దొంగలని, సైకిళ్ళనీ పరీక్షగా చూసాను. కాని నా సైకిలు జాడే తెలియ రాలేదు.

ఇంకేం చెయ్యాలి? పోలీసు సహాయమూ లేదు. బాలార్రోడ్డులోని రైల్వేకూలీలందరినీ పోలీసుస్టేషనుకు పిలిపించి దబాయించచ్చు. అయితే కూలీలందరిలోకీ రైల్వేకూలీలు వట్టి పేచీకోరువాళ్ళు. వాళ్ళలో ఉన్న కట్టు ఎవర్లోనూ ఉండదు. అయితే గట్టిగా దబాయించితే జావజావ అయిపోతారు. నేనే పోలీసునయితేనా! ఎంత బాగుండును! సాక్షులు చెప్పింది ఒకదానినొకటి అతకకపోతే. కొంత సత్యం బయట పడుతుంది. ఆ దొంగతండ్రి పేరేమిటి? వీడయిందీ కాందీ తేల్చుకోవడం ఎట్లా? నీకు ఎంతమంది సంతానం. ఎన్నేళ్ళుంటాయి? అని ప్రశ్నించి తేల్చుకోవాలి. అప్పుడు ఆ దొంగను రప్పించడం తేలిక. అంతేకాదు, ఆ దొంగ జుట్టు అంటకత్తెర వేయించుకున్నాడు. జైళ్ళల్లో ఖైదీకి ఇలాగనే అంటకత్తెర వేస్తారు. ఇక వాడి మొహం! నాకయితే ముఖంచూసి మనిషి గుణ

గుణాలను తెలుసుకునే శాస్త్రం రాదుగాని, నా సైకిలు దొంగిలిస్తూండగా నేను "వాడివాలకమేం బావుండలేదు. దొంగలా వున్నాడు." అన్నాను. వాడి ముఖం చూస్తేనే వాడు దొంగని తోస్తుంది. పీక్కుపోయిన మొహం! బల్లపరుపు జిడ్డుముక్కు! గద్దచూపు! ఇదీ వాడివాలకం!

నేను సైకిలుకోసం గాలించడం మొదలుపెట్టిన మూడో రోజు. వేకువ జామునే నిద్రలేచాను. బండివాళ్ళు ఉదయం ఆరుగంటలకే బాలాజీరోడ్డుకు వస్తారు. నా సైకిలును ఆ దొంగ కొట్టేసినపుడు వీళ్ళు అక్కడే ఉండిఉంటారు. నేను, "దొంగ! దొంగ! పట్టుకోండి." అని కేకలు వేస్తుంటే వెనక్కి తిరిగి చూచేఉంటారు. దొంగ ఈ పరిసరాలవాడే అయితే తప్పకుండా గుర్తుపట్టగలరు. వీళ్ళని అడిగితే ఆచూకీ ఏమన్నా తెలుస్తుందేమో! అందుకని పెందలకాడే బండి వాళ్ళని కలుసుకోవాలని నిశ్చయించుకున్నాను.

అయితే నా సైకిలు కాజేసిన దొంగ బండివాడు కాక పోవచ్చు. బండివాడు కాకపోతే వాళ్ళకి సహాయంచేసేవాడయి ఉంటాడు. బండి వాళ్ళు వట్టిదగాకోర్లని, స్కూలురోడ్డు, మటనాటోరోడ్డు ప్రాంతాలలో నివసిస్తూంటారని ఒక సారా వర్తకుడు మొన్ననాతో చెప్పాడు.

ఆరు గంటలకల్లా బాలాజీరోడ్డు చేరుకున్నాను. కాని రైల్వేకూలీలు ఇంకా రాలేదు. చేసేదేముంది? మటనాటో

రోడ్డుకు బయలుదేరాను. ఆ రోడ్డుమీద గుర్రపుశాలలు, కొట్లు ఉన్నాయి. వీధంతా గడ్డివాసనతో, పేడవాసనతో, మూత్రపువాసనతో గబ్బుకొడుతోంది. ఒక సందు కమాను కింద అయిదుగురు యువకులు రౌడీలలాగా నవ్వుతూ పేలుతూ నిల్చున్నారు. వాళ్ళవాలకం దొంగలవాలకంగా ఉంది. కోడి పిల్లలలాగా దెబ్బలాడుకుంటూ కారుకూతలు కూస్తున్నారు. బూతులు తిట్టుకుంటున్నారు. ఇదంతా సందుకమాను కింద, వాళ్ళ ఆడవాళ్ళ కళ్ళముందు, పిల్లలకళ్ళముందు జరుగుతోంది. ఆదొంగలు చూడగానే నన్ను గుర్తుపట్టి ఎగతాళిచేయసాగారు. వాళ్ళల్లోకల్లా ధైర్యశాలి ఒకడు ముందుకువచ్చి "యేం మిస్టర్, యింత పెందరాళే యెక్కడికి వెళుతున్నారు?" అని ప్రశ్నించాడు. ఎవళ్ళమీదన్నా కోపంవచ్చినా, తమలో అల జడి కలిగిస్తారని అనుమానంవచ్చినా, తమకంటె గొప్పవాడని తోచినా 'మిస్టర్' అని పిలవడం వాళ్ళకి పరిపాటి. రెండురోజుల కితం నా సైకిలు ఎవరో కొట్టేశారనీ, దానికోసరం వెతుకు తున్నాననీ చెప్పాను. దానిమీద వాళ్ళలో ఒకడు ఎగతా ళిగా, "పోయి రెండురోజులయిందీ! యింకా దొరకలా? వెతు కుతూనే వున్నావా?" అన్నాడు.

తక్కినవాళ్ళు మీదమీదకివస్తూ "దొంగవస్తువులు వెతకడానికి ప్రతివాడూ యిక్కడికి తయారయేవాడే. మేమేం దొంగలమా?" అన్నాడు.

నేను ప్రశాంతంగా, "కల్లోగూడా నేనలా అనుకోవడం లేదు. సంపాదన తిండికి చాలీచాలని పరిస్థితుల్లో మీరే పది

హేనువేల లీరాల ఖరీదుచేసే సైకిలునో, వస్తువుతో పోగొట్టు కున్నారనుకోండి. యేంజేస్తారు?" అని ఎదురుప్రశ్న వేశాను

వాళ్లల్లో ఒకడు "యిక కట్టిపెట్టు మిస్టర్! కట్టిపెట్టు!" అని దబాయించాడు. మేమిలా వాగ్యుద్ధం చేస్తుంటే ఈముఠాకి సంబంధించిన ఇంకొకతను చక్కావచ్చాడు. బ్రెజిల్ టోపీ పెట్టుకున్నాడు. చిన్నవాడయినా వాళ్లందరికీ నాయకుడులా ఉన్నాడు. బహుశా అసంఖ్యాకంగా ఉన్న ఫాసిస్టు దళాలలో ఒకదానికి నాయకుడయి ఉంటాడు. ఒకప్పుడు ఈ ఫాసిస్టు దళనాయకులు, "ట్రాస్టెవియర్ ట్రాస్టెవియర్, నిజమయిన రోమ్ ట్రాస్టెవియర్" అని ప్రచారం చేశారు. ఫాసిజం పతనం కాకపోతే వీడికి పట్టపగ్గాలుండేవా?

ఆ అయిదుగురు యువకులు నన్ను హడలగొట్టేయాలని చూశారు. సామాన్యంగా వాళ్ళు ఎగతాళికి ముందు కాలరు పుచ్చుకుని అటూఇటూ ఊపేస్తారు. ధైర్యంగా నిలబడి కోప గించుకోకపోతే ఇంకా బెదిరిస్తారు. అలాగాక మొదట్లోనే బేజారయిపోయాడా, వాడిఅంతు కనుక్కుంటారు. పక్కసందు లోకి లాక్కుపోయి చితకతన్నేస్తారు. చంపేస్తారుకూడా.

ట్రాస్టెవియర్ని గురించి మాట్లాడుతూ నేను చిత్రకారుణ్ణని చెప్పాను. ఇందుకు వాళ్ళేం సంతోషించలేదు గాని కొంత మెత్తపడ్డారు. ఇంతలోకే వీధిలోకున్న మెట్లమీద నించి ఒక ముసలిది దిగివచ్చింది. మొహం ముడతలుపడి పచ్చగాఉంది. చావ సిద్ధంగా ఉన్నట్టు కనిపించింది. ఆమె వాలకం చూసి మోసపోతాంగాని నిజానికి ఆమె మహాచురు

కయిన మనిషి. చుట్టూ ఒక్కసారి పరికించింది. ఆమె ముఖకవళికనుబట్టి నారాక ఆమెకి అమితాశ్చర్యం కలిగించి నట్టు తోచింది. ఆ ముసలిది నాతో ఒక్క మాటయినా మాటాడలేదు. వాళ్ళల్లో ఒకణ్ణి చాటుకు పిలిచి బిగ్గరగా ఏదో అని రహస్యంగా నేను పోలీసు ఏజంటా అని అడి గింది. ఆ యువకుడు, "వాళ్ళు యింతదూరం రారు." అనడం నాకు వినిపించింది.

ఇంకా ట్రాస్టెవియర్ని గురించే మాట్లాడుతూ ఆ అయిదుగురు యువకులు గప్పాలుకొడుతూనే ఉన్నారు. ఒకడు తోలుసంచిలోంచి వెయ్యిలీరాలనోట్లు తీసిచూపించాడు. పాపం! ఇంకొకడు ఈ మధ్య దొంగతనం చెయ్యడానికి పీలు పడలేదేమో, చూపించడానికి ఏమీలేక తుపాకిలై సెన్సు తీసి చూపాడు. ఒక దొంగ తుపాకీలను గురించి మాట్లాడసాగాడు. ఇక నేను వెళ్ళిపోతుంటే సంభాషణను ఆడవాళ్ళమీదికి మళ ల్చారు. వాళ్ళ ఉద్దేశం ఆడవాళ్ళను తారుస్తామని చెప్పి నా దగ్గిరనించి డబ్బు గుంజుకుందామని. నేను రచయితను. అనేక మంది ఆడవాళ్ళను గురించిరాశాను. అయినా నాకు ఇలాంటి పనులలో ఆసక్తిలేదు. అందుకని వాళ్ళమాటలు చెవిని పెట్టలేదు.

దొంగలు నన్ను బాగా పరీక్షించిచూసారు. హోటల్లో కూర్చుని ఈ రెండు రోజులబట్టీ నా విషయమే ...ంచి ఉంటారు. దొంగల ముఠాలలో కొందరు నాసిరకం చిత్రకా రులు, రచయితలు లేకపోలేదు. ముఖ్యంగా ఈ ముఠాలోని ఒక

ముసిలి చిత్రకారుడు నామీద తప్పుడు ప్రచారం చేస్తుంటాడు. ఒకసారి ఈ ముసిలి చిత్రకారుడు ప్రఖ్యాత జర్మన్ చిత్రకారుడు హోపక్ చిత్రం ఒకటి కాపీకొట్టి తన పేరుతో ఒక చిత్ర ప్రదర్శనానికి పంపాడు. దానిమీద నేను అతని గుట్టు బయట పెడుతూ ఒక వ్యాసం ప్రకటించాను. నాటినించీ నామీద పగ బట్టి జూలై 25న రాజకీయ విప్లవసమయంలో నేను ఫాసిస్టునని కేకలు వేశాడు. జనం నన్ను పచ్చడిపచ్చడిచేసేవాళ్ళే. నాతో కూడా ఉన్న నా స్నేహితులు. "వాడి మాటలు నిజంకావు. యితను ఫాసిస్టు వ్యతిరేకి. ఫాసిస్టులను ఎదిరించినందుకు ప్రవాసం పంపారు." అని అంతకన్నా బిగ్గరగా కేకలువేసి నన్ను రక్షించారు.

స్కాలా రోడ్డుమీదుగా వెళుతూంటే ఒక చిన్న హోటల్లో ఒక మనిషి కనిపించాడు. అతనిదగ్గిర ఉన్న సైకిలు నా సైకిలులాగానే ఉంది. అతను దొంగఅయి ఉంటాడని నాకు తోచింది. నేను అతని దగ్గిరికివెళ్ళి సైకిలుకేసి ఎగాదిగా చూసాను.

"యేమిటి?" అని అతను అడిగాడు.

"అమ్ముతారా?" అని నేను ప్రశ్నించాను.

"పన్నెండువేల లీరాలు"

అతని నోటినించి ఈ మూడు ముక్కలు మెల్లిగా పెగిలాయి. అతని కిరాతక ముహంచూస్తుంటే రోమన్‌చక్రవర్తుల మొహాలు జ్ఞాపకం వచ్చాయి. ఇలాంటివాళ్ళతో వ్యవహరించడం మహాప్రమాదం.

"కొంచెమించు యిలాంటి సైకిలే వకటి అమ్మకానికుంది. బేరం కుదరకపోతే తిరిగి నీదగ్గిరికేవస్తా." అని చెప్పాను.

నామాటల్లోని మోసం అతను గ్రహించాడు. అతన్ని దొంగలే నన్ను కలుసుకొమ్మని పంపించారు. నేను పోగొట్టుకున్న సైకిలులాంటి సైకిలు చూపించి కొంటానేమో కనుక్కోమన్నారు. ఏవస్తువునయినా పోగొట్టుకున్నవాడు సహజంగా మళ్ళీ అలాటి వస్తువే కొనుక్కోవాలని ఉబలాట పడతాడు. అందుకని నేనూ పోయిన సైకిలులాంటిది కొనుక్కోవాలని ఉబలాటపడి పన్నెండు వేలు పెట్టి కొని, మెదలకుండా ఊరుకుంటానని దొంగలు ఆశించారు. నేను సైకిలుకోసరం వెతకడం విరమించుకోకపోయేసరికల్లా నేనంటే దొంగలు భయపడుతున్నారని దీనివల్ల తేటతెల్లమయింది. సామాన్యంగా రోమ్ నగరంలో సైకిలు పోగొట్టుకున్నవా డెవడూ దానికోసం వెతుకుతూ కాలం వృథాచేసుకోడు. ఈ రోజుల్లో కాలం మహావిలువయింది. నేను చిత్రకారుణ్ణి, వేదాంతిని. అందుచేత పోయిన సైకిలును రోజులతరబడీ వెతికే తీరికుంది. పోగొట్టుకున్న వస్తువులను వెతికిపట్టుకోవడంకూడా ఒక కళే అని నా సిద్ధాంతం. అందుకే నేను అందరిలాగా చేతులు ముడుచుకుని కూర్చో దలచుకోలేను.

కళ! ఈ కళలో వినోదం ఉంది. అయితే దొంగలు దొంగతనాన్ని వినోదంగా భావించలేరు. వెంటపడ్డవాళ్ళని చూస్తే భయపడిపోతారు. 'ఎదురు తిరిగేవాళ్ళు లేకపోతే

వాళ్ళంత మొనగాళ్ళు లేరు. దోచుకుంటారు. మానవుడు కూడా పుట్టుకతో దొంగే!

ఇలా నాలో నేను మాట్లాడుకుంటూ నా సైకిలు ఎక్కి బాలారీబజారు బయలుదేరాను. అయినా ఇంకో మాటు మాంటీ బజారు చూడాలని బుద్ధిపుట్టింది. ఎడమచేతివైపు రోడ్డుపట్టాను. దారిలో హఠాత్తుగా ఒక జనంగుంపు కనిపించింది. జనం కేకలువేస్తూ హడావిడి చేస్తున్నారు. విచారించగా తొమ్మిదేళ్ళయినా సరిగా నిండని ఒక బాలిక వయసు మళ్ళిన ఒకావిడ పర్సు కొట్టేసిందని తేలింది. ఆవిడ వెంట నా ఈడు మనిషి ఒకతను ఉన్నాడు. ఈ వీధిమధ్యలో ఉన్న చర్చిలో ఈ దొంగతనం జరిగింది. ఆ దంపతులు బహుశా యుద్ధంలో చచ్చిపోయిన కొడుకు ఆత్మశాంతికో, ఏ ఆత్మీయుడి ఆత్మ శాంతికో తలలు వంచి ప్రార్థన చేస్తుండగా ఈ బాలిక మెల్లగా వెళ్ళి పర్సు కొట్టేసింది. ఆవిడ వెంటనే చోరీ కనిపెట్టేసి తరుముకువెళ్ళి ఆ బాలికను పట్టుకుంది. ఇంతలో చర్చి మెట్లకు ఆనుకుని నిల్చున్న ఆబాలికతల్లి పర్సు తీసుకుని పారిపోయింది. సర్వసాధారణంగా దొంగలు తమ పిల్లలకికూడా దొంగతనం చేయడం నేర్పుతారు. పట్టుబడ్డా ఆట్టే ప్రమాదం ఉండదు. చిన్నపిల్ల దానికేం తెలుసు పోనీలే అంటారు. "అబ్బే! నాకేం తెలీదు" అనో, "నాకు ఆకలేసి, అందులో తినే వస్తువేదయినా వుందనుకున్నా" అనో అంటారు. దాంతో జాలేసి విడిచిపెట్టేస్తారని వాళ్ళ ఊహ. ఆ బాలిక ఊరికే ఏడవడం

మొదలుపెట్టింది. ఎవరూ కొట్టలేదు. అయితేనేం ఏడుపు మానలేదు. ఇక పర్సు పోగొట్టుకున్న ఆవిడ: చదువుకున్న దానిలా ఉంది. ఎక్కడయినా మాస్టరీపని చేస్తోందేమో. ఆ బాలికను బాధించాలని ఆమెకేంలేదు. ఆ పర్సులో అతి విలువగల వస్తువుంది. పర్సు ఇస్తే చాలావిడికి. చిత్రం! ఇంతలోకే పక్కవీధుల్లోంచి నలభై యాభై మంది పరుగెత్తుకుంటూ వచ్చి ఆ దంపతులిద్దర్నీ తిట్టిపోయసాగారు. ఒక బొద్దుపాటి ఆడమూతురు, ఆవిడమీద విరుచుకుపడి ఆ బాలికను బాధించవద్దని దబాయించింది. నిజానికి ఎవరూ ఆ బాలికను బాధించలేదు. ఇదోవంక. తనను చంపేస్తున్నారని అందరూ అనుకుని సాయపడి తప్పిస్తారనే ఉద్దేశంతో ఆ బాలిక ఇంకా ఏడుపు ఎక్కువగా మొదలెట్టింది అయితే ఆ జనంలో అందరూ ఆవిడను నిందించలేదు. కొందరు నిజం గ్రహించి పిల్లలకికూడా దొంగతనం నేర్పుతున్న తల్లులను దూషిస్తూ పర్సు పోగొట్టుకున్న ఆవిడను బిగ్గరగా సమర్థించారు.

"నా వుంగరం యేంజేశావ్? యెవరికిచ్చావ్? అది యుద్ధంలో చచ్చిపోయిన నా కొడుకుది. నాది నాకిచ్చేసెయ్. మీ అమ్మకిచ్చావా?" అని అడిగిందావిడ.

జనంకేసి తిరిగి అన్నది; "యీ పిల్లను హింసించాలని నాకేంలేదు. వుంగరం తెచ్చి యిచ్చేస్తే వదిలిపెట్టేస్తాను."

"వుంగరం తెచ్చిస్తే వదిలిపెట్టేస్తావా? తప్పుడుముండ!" అని జనంలోంచి కేకలు వెలువడ్డాయి. ఇంతలో కొంతమంది స్త్రీలు, "ఫాసిస్టు! ఫాసిస్టు!" అని అరవసాగారు. గిట్టనివాళ్ళకి

ఫాసిస్టు ముద్రవేసి అణచేయడం ఈ రోజుల్లో పరిపాటి అయి పోయింది. చిత్రమేమంటే ఇప్పుడు కేకలువేసిన ఈ జనమే, నాకు బాగా జ్ఞాపకం, ఫాసిస్టు మీటింగుల్లో, సైనికవిన్యాసాలలో గొంతులు బొంగురుపొయ్యేటట్లు ఫాసిస్టు నినాదాలిచ్చినవారే!

ఇద్దరు బాలికలు మాంటీబజారులో ఇనపసామాను అమ్ముతున్నారు. స్వయంగా దొంగవస్తువులు అమ్మే ధైర్యం లేని వర్తకుడెవడో వీళ్ళచేత అమ్మిస్తున్నాడు. ఆ సామానులో ఎక్కువగా గుర్రపులాడం ఆకారం సైకిలు తాళాలున్నాయి. మొన్ననే ఇలాంటి తాళం తొంభై లీరాలకి నేను కొన్నాను. అక్కడికే ధర ఎక్కువ పెట్టాను. మూడేళ్ళకితం దీనిధర తొమ్మిదిలీరాలు. ఆ బాలికలలో ఒకతె నూటతొంభై లీరాలు, రెండో బాలిక రెండువందలతొంభై లీరాలు ధర చెప్పింది.

నేను మందహాసం చేస్తూ, "యెదో వకటి తెగించు." అన్నాను.

నామాటల్ని అపార్థంచేసుకుని "మాకు పని చూపించు, యింత తిండి పెట్టు. చూదాం." అని గొణిగారు.

"నన్నేమనుకుంటారేం? నేనెవరనుకున్నారు? నేనేం మంత్రి గార్నా? పొద్దున్న మొదలు సాయంకాలందాకా చచ్చి చెడి పనిచేస్తే సంపాదన యింకంటాక్సుకింద సరిపోతోంది." అన్నాను తొణకకుండా.

"అదృష్టవంతురాలివి. డబ్బూ దస్కం అక్కర్లేకుండానే పని చెయ్యగలుగుతున్నావ్." ఇందులోని చమత్కారం గ్రహించారు గాని పోక్కనీయకుండా, "మాకది సాగిచావదు" అన్నారు.

ఇంతలోకే వాళ్ళల్లో ఒక బాలిక వెయ్యి లీరాలనోట్ల కట్ట బయటికి తీసింది అందులో నలభై దాకా నోట్లు ఉంటాయి. ఈ నోట్లకట్ట బయటికి తియ్యటానికని జాకెట్టు గుండీలు ఊడ దీసింది. ఆమె మాంచి ఖరీదయిన పట్టురుమాలు ధరించి ఉండడం కనిపెట్టాను. రుమాలు మహాపసందుగా ఉంది. అలాంటి రుమాలు నాభార్యకి కొనిపెట్టాలనిపించింది. ఆ పట్టు రుమాలులోంచి రెండురకాల వాసనలు వెలువడ్డాయి. ఒకటి చెమటవాసన, రెండోది మాంచి గుమ్మమనే అత్తరువాసన. "మిత్రరాజ్య సైనికుల కోసరం వీళ్ళని అట్టే బెట్టారు." అనుకున్నాను. వీళ్ళు ఉదయంపూట మాంటీబజారులో బేరగాళ్ళను మోసగించి అసలు ఖరీదుకు పదిరెట్లుకు అమ్ముతూంటారు. మధ్యాహ్నం కొంపకి చేరుకుని మస్తుగా తిని మూడు నాలుగు గంటలు నిద్రపోతారు. నిద్రలేచింతర్వాత సింగారించుకుని మెల్లిగా చీకటిపడేసరికి అమెరికన్ సైనికుల్ని కలుసుకుని వాళ్ళతో తాగి తందనాలాడతారు. జనాభాని పెంచుతారు!

మొన్నటి దొంగలే మళ్ళీ ఇవాళ మాంటీబజారులో ప్రత్యక్షమయారు. నేను తొందరతొందరగా బాలారీరోడ్డుకు తరలిపోయాను. ఇక్కడికి బండివాళ్ళు ఆరేడు గంటలకే

వస్తారంటారు గాని నిజంగాదు. రోమ్‌నగరంలో ప్రతీదీ ఎంత లేదన్నా అరగంట ఆలస్యం అవుతూనే ఉంటుంది. బండివాళ్ళు ఎనిమిది గంటలకి వస్తారు. కొంతమంది పనిలోకి వెడతారు. కొంతమంది రోడ్డుమీది ఇళ్ళగోడలకి ఆనుకుని పొగతాగుతూ, నవ్వుతూ పేలుతూ, దోవబోయేవారిని ఎగతాళిచేస్తూ కాలం గడుపుతూంటారు.

పాంపేబజారులో దొంగలముందు, బాటసారులముందు సోమారిపోతులాగా నిల్చోడం బాగుండదని ఒక పుస్తకాలమ్మే వానితో బాతాఖానీ ప్రారంభించాను. వంద లీరాల ఖరీదు చేసే పుస్తకాలు పది లీరాలకే కొని అతను హెచ్చుధరకి అమ్ము తూంటాడు. ఈ బాపతువాళ్లే రోమ్‌నగరంలో తెలివితేటల మూలకంగా కాకుండా వంచనవల్ల ఎక్కువగా డబ్బు చేసు కుంటూంటారు. అతను నన్ను బాగా ఎరుగున్నాడు. పొగర బోతు, మాయలమారి, అత్యాశాపరుడు, మొండిశిఖండి. ఎవరన్నా దుకాణందగ్గిరికి రాగానే అతన్ని తొందరగా వది లించుకోడానికి "నాదగ్గిర ఆ పుస్తకంలేద"నో, "అయిపోయా య"నో చెప్పి పంపించేస్తుంటాడు. ఖర్మంచాలక ఎవరన్నా "ఫలానా పుస్తకం ఖరీదెంత?" అని ప్రశ్నిస్తే ఎక్కడలేని ధరా చెప్పి హడలగొట్టేస్తాడు.

అందుచేత అతనితో మాట్లాడడానికి మొదట తట పటాయించాను. కాని కాసేపు అక్కడ ఆగడానికి ఏదో ఒక వంక ఉండాలిగా, మాటల్లోకి దింపాను. నా సైకిలు పోయిందనే సంగతి అతనికి అదివరకే తెలిసింది. అయినా,

"యేవిటి విశేషాలు?" అని నన్ను ప్రశ్నించాడు. ఈ విధ మయిన కుశలప్రశ్నలయిన తరవాత బండివాళ్ళ నిజాయితీని గురించి ప్రశ్నించాను. తనకేం తెలియదన్నాడు. నేనూ ఆ విషయం పెద్దగా పట్టించుకోకుండా తోసెయ్యాలని చూసాను. కాని అతను ఊరుకుంటేగా! నా సైకిలుపోయిన సంగతి తనకేం తెలియదన్నట్టు మొదట్లో నటించినవాడల్లా "సైకిలు దుకాణం ముందు యెందుకువదిలిపెట్టావ్?" అని అడిగాడు.

"యెందుకా? ఆ దుకాణం చిన్నది. సైకిలు కిటికీకి ఆనించి బూటుపాలిషు అడుగుతున్నానోలేదో యింతలో దొంగ..." నా కథంతా చెప్పాను. "ఊఁ-బాగానేవుందిగాని యేం జరుగుతుందనుకుంటున్నా?" అని ప్రశ్నించాడు తొణక కుండా.

"అవును నీదేంపోయింది? నీవస్తువ్వూ వకటి కొట్టేస్తే అప్పుడు తెలిసివచ్చేది!"

అతను రెచ్చిపోతూ, "పెద్ద మనుషులు దగ్గరనించీ పచ్చిదొంగలదాకా అంతా నా కొట్లో యెదో వకటి కొట్టే స్తూనే వుంటారు. రెండువారాల కితం ఇద్దరు రెండు చెక్క పెట్టెలు కొట్టేసి వాటిల్లో వున్న పుస్తకాలు మాత్రం వాళ్ళ ధర్మమా అంటూ, వదిలేసిపొయ్యారు."

నాకు బాగా అర్థమయింది. ఇక్కడి దొంగలకి పుస్త కాలు దొంగిలించాలని ఉండదు. అవేం కొరుక్కుతినేవా, పెట్టేవా? అందుచేత ఇక్కడి దొంగల దృష్టిలో వాటికి విలువ లేదు. నా సైకిలు పోయిన మార్నాటిరాత్రి ఆ చెప్పుల

దుకాణాదారు కొట్లోనించి రెండు బట్టల మూటలు, ఒక మోటారుసైకిలు మాయమయ్యాయని అతనుచెప్పాడు. అయితే ఆ రెండు బట్టల మూటలు దుకాణాదారువికావు. మూడు రోజుల కితం నగరంలోంచి వెళ్ళిపోయిన ఒక కాందిశీకుడివి. పుస్తకాలమ్మేవాని పుస్తకాలుపోలేదు. చెప్పుల దుకాణాదారు చెప్పులు పోలేదు. దీనినిబట్టి దుకాణాదారులు, దొంగలు ఒకరి నొకరు ఎరుగున్నారనీ, ఒకరిజోలికి ఒకరు పోరనీ తేలుతుంది. లేక పోతే దొంగలముఠాలు, కపటవర్తకులు ఈ బజారులో కలిసి మెలిసి ఎలా ఉండగలుగుతారు? చౌకుచుట్టూ ఉన్న ఈ పది దుకాణదారులకి ఇక్కడి దొంగలముఠా బాగా తెలిసుండాలి. అందుకే వాళ్ళ సరుకులను దొంగలెవరూ ముట్టుకోరు.

ఈ భావాలు నా బుర్రలో సుళ్ళు తిరుగుతూండగా నా సైకిలు దొంగ ఎక్కడ దాక్కేదీ అతనికి తెలుసనీ కావా లనీ చెప్పడంలేదనీ గ్రహించాను. ఈ చౌకులో బళ్ళవాళ్ళ మధ్య సైకిలు దొంగని పట్టుకోవచ్చని తలచాను. కాని ఇక్క డుంటె దొంగ నాకంట పడేవాడే. ఆ దొంగవాలకం జ్ఞాపకం తెచ్చుకున్నాను. పీక్కుపోయిన మొహం, మరీదగ్గరసగాఉన్న కళ్ళు, వెడల్పాటి సొట్టముక్కు, తెల్లటి పొట్టి ఉన్నిమేజోళ్ళు, ఫాసిస్టు సిపాయిల బెల్టులతో తయారుచేసిన చెప్పులు!

దుకాణాదారు దగ్గిరనించి కూపీతీయాలనీ, కాసేపు కాలక్షేపం చెయ్యాలనీ ఉద్దేశించి రాజకీయాలు ఎత్తాను.

అతనికి రాజకీయాలంటె మహాపిచ్చి. నాకయితే ఎక్కువగా రాజకీయాలు తెలియవుగాని అతనితో మాట్లాడడానికి తగినంత తెలుసు. మాటల సందర్భంలో లీరా విలువ తగ్గిపోయిన విషయం ప్రస్తావించాను. దుకాణందారు అత్యాశాపరుడాయె! ప్రశ్నలమీద ప్రశ్నలు వేయసాగాడు. నేను తగినట్టుగా జవాబు చెప్పుతున్నాను. ఇంతలో నేను కల గంటున్నానా, నిజమా!

సైకిలుదొంగ నాకు కనిపించాడు! పక్క సందులోంచి వచ్చి అక్కడి దొంగల ముఠాలో కలిసిపోయాడు. నేను వాణ్ణి గుర్తుపట్టాను. వాడు నన్ను గుర్తుపట్టాడు. కాని ఏమీ తెలియనట్లు నటించాడు. జేబులో చేతులు పెట్టుకుని తోటిదొంగలతో మాటలు ప్రారంభించాడు. పక్కన అతని అన్న ఉన్నాడు. అతను ఆ దొంగకిఅన్న అని నా కెవరూ చెప్పలేదు. పోలికను బట్టి గ్రహించాను. ఇద్దరి దుస్తులు వేరువేరు. అంతేభేదం. ఏం చెయ్యాలి? దుకాణాదారుని అడిగాను: "ఆ కుర్రాడి పేరు నీకు తెలుసా?"

"యే కుర్రాడు?"

దుకాణాదారు దొంగను ఎరగనట్టు నటించాడు. మాట్లాడకుండా నా ప్రశ్నని దాటేద్దామని చూచాడు. కాని నేనూరుకోలేదు. గుచ్చిగుచ్చి అడిగాను. అతను తనకు తెలియదని దబాయిస్తే ఇంకెవరినన్నా అడిగి తెలుసుకోనేవాడిని. అంతకష్టం అక్కరలేకుండా దుకాణందారే వాడిపేరు పాపా అనుకుంటానన్నాడు.

"ఆపక్కన నిల్చున్నవాడో, వాడి అన్నా?"

"అవును. నువెట్లా పసిగట్టావ్?"

"వాళ్ళు నిజాయితీ పరులేనా?"

"నిజాయితీ పరులు!" అని దుకాణందారు ఎగతాళిగా, ఏదో చిక్కులో పడ్డవాడిలాగా జవాబిచ్చాడు. "అదిగో, ఆ ఫర్నిచరుషాపు వాళ్ళే నడుపుతున్నారు."

ఆ దొంగల ముఠా ఆ షాపు గుమ్మానికి ఎదురుగా నిల్చున్నారు. వాళ్ళల్లో ఒకడు లేని హుషారు తెచ్చుకుని మాట్లాడుతున్నాడు. ఇక ఆ దొంగ, పాప జేబులో చేతులు పెట్టుకుని ఏపాపమూ ఎరగని అమాయికుడిలా నిల్చున్నాడు. నోటితో మాట్లాడకుండా అన్నదమ్ము లిద్దరూ కళ్ళతో మాట్లాడుకుంటున్నారు. నే నేంచెయ్యాలి? ఆ చౌకులో ఎక్కడా పోలీసంటూ లేడు. కాలమాన పరిస్థితులు వేరుగా ఉంటే, "దొంగ! దొంగ పట్టుకోండి." అని అరిచేవాడినే. కాని నేటి పరిస్థితులలో అరిచి ప్రయోజనంలేదు, చర్చిలో పర్సుపోగొట్టుకున్న దంపతులు, దొంగను వదిలిపెట్టమని జనం మూకుమ్మడిగా వచ్చి వారిమీద పడడం-ఆ దృశ్యం అదృష్ట వశాత్తు నా కంటపడింది. నిజాయితీపరులుగా కనిపించడమూ ప్రమాదమే!

సరిగ్గా ఆ సమయానికి ఒక స్త్రీ, ఒక పురుషుడు బిగ్గరగా పోట్లాడుకుంటూ వెళుతున్నారు. ఆ స్త్రీ బక్క-పల్చగా ఉంది. మంచి యవ్వనంలో ఉంది, శరీరమంతా సున్న

రోగాలతో పుచ్చిపోయింది, ఆ పురుషుడు ఆమె బారినించి తొందరగా తప్పించుకుపోవాలని చూస్తున్నాడు.

"మాయలమారి వెధవ! నీ పెళ్ళాంతో చెప్తానుచూడు." అంటోందా స్త్రీ.

గందరగోళం బయలుదేరింది. జనం పోగయ్యారు. ఈ గందరగోళం ఆసరా చేసుకుని సైకిలుదొంగ, వాడి సహచరులు జనంలో కలిసి మాయమయి చక్కాబోయారు. నేను నా సైకిలుమీదికి దూకి దొంగవెంట పడ్డాను. ఇక నా కనుగప్పలేనని గ్రహించి పాపా తన స్నేహితులలో ఒకడికేదో చెప్పాడు. ఆ స్నేహితుడూ వెంటనే సైకిలు ఎక్కాడు. పాపావెంట పడడమా, వాడి స్నేహితుడివెంట పడడమా? నాకు సందిగ్ధావస్థ వచ్చిపడింది. పాపా స్నేహితుడి వెంట పడాలనే నిశ్చయించుకున్నాను. నా సైకిలు దొంగ సంగతి సందర్భాలు తెలిసినాయి. పోలీసులమీద ఆధారపడి ప్రయోజనం లేదని నాకు తెలిసొచ్చింది. నా అంతరాత్మ పాపా స్నేహితుడివెంటపడమని చెబుతోంది. అంతరాత్మ చెప్పినట్టు నడుచుకోవడమే శ్రేయస్కరం. వాడి కంట పడకుండా వెంబడించి, వాడితోపాటు దొంగసైకిళ్ళు దాచిన చోటికి చేరుకుందామని ఆలోచించాను. అదృష్టవశాత్తు నా సైకిలును వేరేచోట దాచడానికి వాడు బయటికి తీయచ్చు, పోనీ తీయకపోయినా, నా సైకిలు దాచినచోటయినా తెలుసు కోగలుగుతాను. కేకలు పెడితే దొంగ నన్ను పొడిచెయ్యొచ్చు. అయినా జనం పోగవుతారు. నా దగ్గిర కత్తీ వుంది, సైకిలు

కొన్న రసీదు ఉంది. భయంలేదు. జనం పోగయితేచాలు, తరవాత చూచుకోవచ్చు.

ఇలా ఆలోచిస్తూ పాపా స్నేహితుడు వెంటపడ్డాను. పానికోరోడ్డు మలుపులో ఆగి సైకిలు చెడిపోయిందేమోనని పరీక్షిస్తున్నట్టు నటించాడు. సైకిలుగొలుసును పరీక్షిస్తూ చుట్టూ చూసాడు. నేను కంటబడ్డాను. ఇంకేం వెంటబడ్డానని గ్రహించాడు. సరే. ఇప్పుడు కాకపోతే ఆనకయినా గ్రహించే వాడే. నేను సైకిలువేగం తగ్గించి పక్కరోడ్డుకు తిరిగి మళ్ళీ వెనక్కి వచ్చి వాడిని అనుసరించాను.

పానికోరోడ్డుకు ఎడమపక్కన ఉన్న ఒక బ్రాందీషాపు లోకి వాడు వెళ్ళి ఫోనులో ఎవరితోనో మాట్లాడాలని యత్నించాడు గాని లాభంలేకపోయింది. రోడ్డుపక్కన ఒకడు వేడివేడి జీడిగింజలు అమ్ముతూంటే కొని తింటూ నిల్చున్నాను. బ్రాంది షాపులోంచి దొంగ తన సహచరులను పిలిచి నా వైపు కోర చూపులు చూస్తూ వాళ్ళతో మాట్లాడాడు. ఆ దొంగ నిర్మానుష్యంగా ఉన్న వీధిలో సైకిలు వదిలిపెట్టి వెళ్ళాడు. తనది ఎవరూ ఎత్తుకునిపోరని వాడిధీమా! వాడి దృష్టిని ఆకర్షించి, నామీద వాడు చేయిచేసుకునే అవకాశం ఇవ్వకూడదని 'వెడెట్టా రిపబ్లికానా' అనే పత్రిక కొని చదువుతున్నట్టు నటించసాగాను. వెడెట్టాలో అదివరకే నా వ్యాసాలు కొన్ని పడ్డాయి. ఇంకొకటి వెలువడడానికి సిద్ధంగా ఉంది. నేను పత్రిక చదువుతున్నట్లు నటిస్తున్నానని వాడు గ్రహించాడు.

నేను తనని వెంబడిస్తున్నానని వాడికి తెలిసిపోయింది. ఇక నా సైకిలును బయటికి ఎందుకు తీస్తాడు! తియ్యడు. కాని నా సైకిలును దగ్గిరిలో ఏ దుకాణం వెనకో దాచిఉంటాడు. కొంతమంది సైకిలు అమ్మకందార్లు తాము దొంగసైకిళ్ళని కొనం, అమ్మం, అని పైకి చెబుతూనే దొంగవ్యాపారం సాగిస్తారు. నేనిలా ఆలోచిస్తుండగా దొంగ మళ్ళీ సైకిలు ఎక్కి నిర్మానుష్యంగా ఉన్న ఆ వీధి వెంబడే బయలుదేరాడు. నేనూ వెంబడించాను.

వీధిచివరికి వెళ్ళింతరవాత హఠాత్తుగా వెనక్కి తిరిగి వాడు నన్ను కొట్టబోయాడు. వాడి అరచెయ్యి చూచాను. మహా పెద్దది. వేంట్రుకలు నిగడపొడుచుకున్నాయి. కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. పరిస్థితి తమాషాగానే ఉంది. భీతావహంగానూ ఉంది. దొంగలు వసుధా వట్టి పిరికివాళ్ళు. ఒంటరివాడితో నయినా సామాన్యంగా ఒంటరిగా పోట్లాడరు. అందుకని నేనొకడుగు వెనక్కివేసి ధీమాగా నుంచున్నాను. నేననుకున్నట్టే అందరి దొంగల్లాగా వాడూ వట్టి పిరికిపందే! కొట్టుకునేది ఇద్దరే అయితే భయపడడంలో అర్థంలేదు.

నేనేం కలగజేసుకోలేదు. మొదటిదెబ్బ కొట్టనియ్యి చూదామని ఊరుకున్నాను. కాని వాడు బిగ్గరగా కేకలువేసి కిందపడి మూర్ఛరోగిలా తన్నుకోసాగాడు. ఇదంతా నన్ను భయపెట్టడానికీ, దగ్గిరలోఉన్న స్నేహితులకి తనస్థితి తెలియజేయడానికే.

ఇటువంటిది నాకేం కొత్తగాదు. ఫాసిస్టులు అనేకసార్లు నన్ను చావగొట్టారు. కాని అదృష్టవశాత్తూ నాకేం అపాయం జరగలేదు.

"యేంకావాలి? చవటవెధవ! యేంకావాలి?" అని వాడు కేకలు వేశాడు.

"నాకేం అక్కర్లేదు. నువ్వే యీ రభసంతా ప్రారంభించావ్. నేను సైకిలు వెతుక్కుంటున్నాను." అన్నాను.

వాడు లేచి, "అక్కర్లేదంటే? లంజకొడకా! నీ సైకిలు నేనేం యెత్తుకుపొయ్యాననుకున్నావ్? వెధవసైకిలు. నీ సైకిలెంత? నువ్వెంత" అంటూ ఒకటే తిట్టిపోయడం ప్రారంభించాడు.

నేనేం చలించకుండా, పరాకుపడకుండా; దెబ్బకాచుకోడానికి సిద్ధంగా నిల్చున్నాను.

వాడు నన్ను కొట్టలేదు. వాడి ఉద్దేశమల్లా హంగామా చేసి తనకు వత్తాసిచ్చేవారిని పోగుచేయడమే. పిరికిపందలందరిలాగా వాడూ జనాన్ని ఆకర్షించడానికి కేకలువేశాడు. ఇక జనంకూడా ఇదేమచ్చు, దొంగలు ఒంటరివాణ్ణయినా అయిదారుగురు కలిసిగాని ఎదిరించరు. నా దగ్గిర కత్తి ఉందని దొంగకు తెలును. పాంపేరోడ్డుమీద నా సైకిలు సీటుకున్న తాడు కోసేస్తూంటే చూచిన తోడిదొంగలు వాడికీ విషయం చెప్పిఉంటారు.

ఒక్క క్షణంలో పానికో రోడ్డునించి పదిమంది దొంగలు, తదితరులు మా చుట్టూ గుమిగూడారు. ఇందాక

చర్చిముందు దృశ్యానికి నేను ప్రేక్షకుణ్ణి. ఇప్పుడు అలాంటి ఈ దృశ్యంలో పాత్రధారిని. ఈ గుంపులో పోర్టెసీబజారు దొంగలు అయిదుగురు కనిపించారు.

వాళ్ళు నన్ను నానా బూతులు తిట్టసాగారు. నేను రెచ్చిపోకుండా నిశ్చలంగా నుంచునేసరికి ఏమనాలో వాళ్ళకి తెలియలేదు. నన్ను దొంగంటారా? వాళ్ళూ దొంగలాయె. నలుగురూ నవ్వి ఏమంటారు? తోడిదొంగలంటారు.

చివరకి. "నా సైకిలు పోయింది. వెతుకుతున్నాను. యిందులో తప్పేముంది?" అన్నాను.

పెద్దమనుషులు, దొంగలు తర్కించుకుంటూంటె పెద్ద మనుషుల్ని నిగ్గదీయాలని సరదాపడే ఒకతను, "పోయిన సైకిలు వెతకడానికి పానికోకి వచ్చావా? భేష్! మహా తెలివయిన పని చేశావ్!" అన్నాడు.

"యెక్కడికి వెళ్ళాలేం? వాటికన్‌కి వెళ్ళమంటావా? క్వెరినాల్‌కి వెళ్ళమంటావా? నాలుగు వైపులా వెతుకు తున్నాను. యెవర్నీ యిబ్బంది పెట్టడంలేదు. యిబ్బంది పెట్టాలనే వుద్దేశమే నాకులేదు." అని నేను గట్టిగా జవాబిచ్చాను.

"బ్రాస్చీభవనంలో వెతకరాదూ?" అని ఒక దొంగ అసహ్యంగా అన్నాడు. బ్రాస్చీభవనం రోమన్ ఫాసిస్టు పార్టీ ప్రధాన కార్యాలయం.

బ్రాస్చీభవనం అనే మాట చెవిని పడగానే ఇంకొకతనికి తానొకప్పుడు ఫాసిస్టు సైనికుణ్ణని జ్ఞాపకం వచ్చింటుంది, కాలంతోపాటు ఇంకోపార్టీలో చేరినా వెనకటి దుందుడుకు

తనంమాత్రం వదలలేము, "పో. వెళ్ళిపో! ఫాసిస్టు వెధవా!" అని బిగ్గరగా అరిచాడు.

ఇదంతా వాళ్ళకి కొట్టిన పిండేగా! ఇంకొకడు, "ఊఁ- నువ్వు ఫాసిస్టువని మాకు తెలియదనుకున్నావేం? నువ్వు కవాతు చేస్తుండగా చూశాంలే." అన్నాడు.

పచ్చిఅబద్ధం! నేనెన్నడూ కవాతులో పాల్గొనలేదు. అటువంటి ఉద్దేశమూ నాకు లేదు. పైగా ఆరోజులలో నేను రోమ్‌లోనే లేను.

ఇంకేం తమదే పై చెయ్యి అనుకున్నారు. జనంకూడా యాభై మందయ్యారు. చెవులు గింగురుమనేట్లు కేకలువేశారు. నేను ప్రశాంతంగా అన్నాను:

"ఫాసిస్టునా? ఊఁ- అంతేనా? నేనేగనక ఫాసిస్టునయితే నన్ను ప్రవాసం పంపేవారా? జైల్లో పెట్టేవారా? ఫాసిజాన్ని ఎదిరించడం మహా అపాయకరంగావున్న రోజుల్లో ఫాసిజాన్ని ఎదిరించాను. యిప్పుడు ఫాసిజాన్ని తిడుతూ తెగవాగడంకంటే ఆరోజుల్లో యెదిరించడమే ఘనకార్యం."

"నువ్వా, నువ్వా జైలు కెళ్ళేవా?" అని ఒకడు నా మొహంమీద పిడికిలి ఝళిపిస్తూ అన్నాడు.

ఇంకొకతను, "నువ్వా జైల్లో యెప్పుడున్నావ్? నమ్మాలనేనా! మా గొడవ నీకెందుకు? నువ్వు పోలీసువికావు. నువ్వు ఫాసిస్టువి! గూఢచారివి! పో, వెళ్ళిపో." అన్నాడు.

పాపం! ఇతనూ అందరికిమల్లే నేను అబద్ధాలాడుతున్నా నని నమ్మాడు. అందుకే అందరూ నామీద విరుచుకుపడ్డారు.

మరొకతను గప్పాలుకొడుతూ "నువ్వు ఫాసిస్టు వ్యతిరేకివా? నేనూ ఫాసిస్టువ్యతిరేకిని. టాసోరోడ్డులో వుండేవాడిని."

ఈ ఘర్షణంతా ప్రహసనంగా మార్చే అవకాశం నాకు లభించింది. ఈ అవకాశాన్ని విడిచిపుచ్చకుండా,

"టాసోరోడ్డులోనా? నువ్వా? యెక్కడ? యెప్పుడు? షికారుకు వెళ్ళావా? ఆ-తప్పకుండా షికారు వెళ్లుంటావ్! లేకపోతే జర్మనీవాళ్ళతో చేతులు కలిపి సైన్యంలో వంటలవాడివిగా పని చేసుంటావ్! యింకేం!" అని ఎత్తిపొడిచాను. ఇది నిజమేకావచ్చు. నాకు తెలియదు. కాని నా మాటలు బాగా పనిచేసాయి. వాడు అదిరిపోయి "యేమిటీ?" అన్నాడు.

"ఆ-యేవుందీ! అదే. యిప్పుడు చెప్పలా? నా పత్రాలు చూస్తావా?"

"సరే, పోనీ. పత్రాలు చూద్దాం." అన్నాడొక ప్రేక్షకుడు.

ఈముక్క నా చెవిని పడేసరికి ఇక పరవాలేదనుకుని వెడెట్టా రిపబ్లికానా పత్రిక జేబులోంచి పైకితీసి చూపుతూ, "యిదిగో నా వ్యాసం. చూడండి. యిదిగో నా సంతకం! యిదిగో నా గుర్తుకార్డు? రెండూ వకటిగానే వున్నాయా? యింకేమంటారు?"

అదృష్టంకొద్దీ జైలులో పడ్డవాళ్ళకిచ్చే ఎర్రపుస్తకం నా జేబులో ఉంది. తీసి చూపించాను. దానిమీద జనం

రెండుగా చీలిపోయ్యారు. నాకు గండం తప్పింది. నన్ను హతమార్చాలనివచ్చిన దొంగలు కేకలువేయడం కట్టిపెట్టే సారు.తతిమ్మావాళ్లు వెక్కిరిస్తూ ఏవేవో సలహాలు ఇస్తున్నారు.

“స్వాతంత్ర్యం, ధర్మం విషయంలో మీకు బలేభావా లున్నాయే!” అన్నాను నవ్వుతూ. “నేను రిపబ్లికనునో, సోష లిస్టునో, కమ్యూనిస్టునో కాకపోతే హతమార్చేద్దామను కున్నారుగదూ? మీరింతదాకా వినని శాంతిపార్టీకి చెందిన వాడిననుకోండి. నిజానికి యుద్ధం అయిపోయాక ఉండవలసిన పార్టీ అదొక్కటే! రిపబ్లిక్ పార్టీ బూర్జువాపార్టీ అన్నా కావాలి, లేకపోతే శాంతిపార్టీ అన్నా కావాలి.”

“మనల్ని కంగారు తినిపించా”లని చూస్తున్నాడు. తన్నండి! తన్నండి! అన్నాడొకతను. బహుశా అతను అందర్నీ ముందు కంగారుపెట్టే రకంవాడయి ఉంటాడు.

కాని ఇలా బెదిరించడం నాకు మంచి వీలు ఇచ్చింది. పోయిన సైకిలుకోసం వెతుకుతున్న మనిషిమీద రష్యాలో ఇలా చెయ్యిచేసుకోరని బిగ్గరగా అరవసాగాను. రష్యాలో ఇలాంటిది జరగదని గట్టిగా చెప్పలేం. కాని నేనుమాత్రం ఆగకుండా, “రష్యాలో అందరూ ప్రశాంతంగా జీవిస్తారు. ప్రతీవాడికి కడుపునిండా తిండిదొరుకుతుంది. దొంగలు మచ్చు కయినా కనిపించరు. అక్కడ స్వేచ్ఛగా దోపిడీలు సాగవు. దొంగలకు పెద్దమనుషులు సహకరిస్తూండబట్టే గొడవలు తయారవుతున్నాయి.”అన్నాను.

'దొంగలు' అనే పదం నేను ఉచ్చరించేసరికల్లా ఆ దొంగల్లో ఒక్కడూ ఇక నోరు మెదపలేదు. నా వ్యాసం బాగా అర్థంచేసుకోవాలని యత్నించారు.

ఇంతలో ఒక సిపాయి చక్కావచ్చాడు. యువకుడు, పొట్టి మనిషి. వాడూ నామీద దాష్టీకంచేస్తూ, "పో, వెళ్ళిపో, పో." అని నా చెయ్యిపట్టుకున్నాడు. జనంకేసి తిరిగి "నేను తీసుకు చక్కాబోతాను." అన్నాడు.

పాపం! నను రక్షించాలనే ఈ తాపత్రయమంతా. కాని వాడివెంట వెళితే నా గతి యేమయేదో! నేను రానని ఖండితంగా చెప్పి నేను రిపబ్లికన్ పార్టీ వాణ్ణనీ నను ముట్టుకుంటే, జాగ్రత్త అని బెదిరించాను. దాంతో వాడు తగ్గి గొణుక్కుంటూ చక్కాబోయాడు. ఈ ఘర్షణ అంతా చూస్తున్న కొంతమంది రిపబ్లికన్లు నాకు బాసటగా నిలచారు. దాంతో దొంగలు తదితరజనం ఎక్కడివాళ్ళక్కడ మాయమయి చక్కాబోయారు.

నే నొక్కణ్ణే మిగిలాను. నా సైకిలు పట్టుకోవడానికి ఇంకో మార్గం—పోలీసు సహాయం కోరడం. తొక్కుదామని ఆలోచించాను. మొదట్లో ఈ మార్గం తొక్కడం వట్టి తెలివి తక్కువ అనుకున్నాను. పోలీసులంటే నాకు ద్వేషమూ లేదు, పెద్ద ఇష్టమూ లేదు. వాళ్ళతో వ్యవహరించడమంటేనే అసహ్యం.

నేను ఒక పోలీసు ఠాణాకి వెళ్ళాను. అది తక్కినవాటి కంటె మరేం శుభ్రంగా లేదు. మేడమెట్లకు దీపాలు లేవు. చీకటికోణంగా ఉంది. కిందభాగంలో ఒక పోలీసు విరిగిపోయిన కుర్చీలో కాళ్ళుచాచుకుని కూర్చున్నాడు.

దొంగల పాలపడకుండా సైకిలు ఎక్కడ దాయమంటా వని నేను ఆ పోలీసుని అడిగాను.

"ఆబ్బే! యిక్కడ వీల్లేదు" అన్నాడు. వెటకారంగా.

"అయితే యెక్కడ పెట్టను?"

"నాకేం తెలుస్తుంది. నీ తిప్పలు నువ్వు పడాలిగాని."

నా తిప్పలు నేను పడాలిట! ఇదీ ఇక్కడి పోలీసుల వైఖరి! ప్రజల ఆస్తిపాస్తులు రక్షించాల్సిన పోలీసులు, పోలీసు స్టేషనులో ఇలా మాట్లాడితే ఇంకేం చెప్పాలి!

స్టేషను ఆవరణచుట్టూ కలియజూసి "యిక్కడ సైకిలు భద్రంగానే వుంటుందిగా. యేమంటావ్?" అన్నాడు.

"నాకేం తెలీదు." అని పూర్వంకంటే ఇంకా వెటకారంగా జవాబు చెప్పాడు. తర్వాత పిడికిలి ఆడిస్తూ, "నువ్వే భద్రంచేసుకో. నీతంటాలు నువ్వుపడు." అన్నాడు.

ఆవరణలో ఒక కొళాయి కనిపించింది. సైకిలు దానికి ఆనించి ఎందుకయినా మంచిదని రెండు తాళాలు వేసాను. మెట్లెక్కి పైకి వెళ్లాను. పైన గదిలో పదిమంది పోలీసులు గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నారు. ఒకడి మొహంలోనూ కళాకాంతులు లేవు. జర్మన్ ఆక్రమణరోజుల్లో కమ్యూనిస్టుల్ని,

ఫాసిస్టు వ్యతిరేకుల్నీ, నాజీలకోపానికి గురయిన తదితర అమాయకుల్నీ ఉరితీయడానికి డబ్బుకి కక్కుర్తిపడి వీళ్ళు తోడ్పడ్డారు. ఇప్పుడు పరిస్థితులు తారుమారయాయి. ఇలాంటి వాళ్ళందర్నీ మిత్రరాజ్యాల కంట్రోలు కమీషను, యూళన సంఘం విచారించి శిక్షిస్తోంది. తమగతి ఏమవుతుందోనని వీళ్ళు హడలిపోతున్నారు.

"యినస్పెక్టరుగారున్నారా?" అని నేను అక్కడి పోలీసును ప్రశ్నించాను.

"లేరు" అని మామూలు ధోరణిలో వెటకారంగా జవాబు చెప్పాడు. సార్జెంటుకేసి తిరిగి, "వీరి గోడవేదో వింటారా?" అన్నాడు.

కాని సార్జంటు తక్కినవాళ్ళకంటె ఎక్కువ విచారంలో మునిగిఉన్నాడు.

"తీవ్రసంఘటన నొకదానిని గురించి చెప్పాలనుకుంటున్నా. ఏ సైకిలు దొంగతనంలాంటిదో కాదు. దొంగను నేను పట్టుకున్నాక సానికోరోడ్డుమీద జరిగిన తిరుగుబాటును గురించి చెప్పదలచా."

ఈముక్క కొంతమంది పోలీసుల దృష్టిని ఆకర్షించింది. కాని సార్జంటుమాత్రం విననట్లు నటిస్తూ ఉదాసీనంగా ఉండిపోయ్యాడు. ఇంతలోకే మరికొంతమంది పోలీసులు చక్కా వచ్చారు.

"విన్నారా? తోలు వలిచేయడానికి సిద్ధమయారు."

పంజరిగిందేమిటని నాదగ్గిరగా తచ్చాడుతున్న ఒక పోలీసుని అడిగాను. ఒక ఇంట్లో అద్దెకున్నవాళ్ళని లేవగొట్ట డానికి ఈ పోలీసుల్ని పంపారట. తీరా వాళ్ళు ఆ ఇంటికివెళ్లే సరికి అద్దెకున్నవాడు ఖాళీ చేయడానికి నిరాకరించి 'రక్షిం చండి, రక్షించండి.'' అంటూ కేకలు పెట్టాడట. ఇంకేం ఆ చుట్టుపక్కల జనం కర్రలు పుచ్చుకుని మూకుమ్మడిగావెళ్ళి పోలీసులమీద పడ్డారట. భగవంతుడి దయవల్ల పోలీసులు తప్పించుకుని పిక్కబలం చూపారట. ఇదీ విషయం.

ఇది సైకిలు దొంగతనంకంటెకూడా దారుణమైన విషయం! శాశనసంఘంవాళ్ళు మోపిన నేరాలకి సమా ధానం చెప్పుకోవడం ఎలాగా అని కొందరు ఆలోచిస్తుంటే, చావు తప్పించినందుకు కొందరు భగవంతుడికి మొక్కుతూంటే ఇక నా గొడవ వినేదెవరు? ఇదంతా నాకు చక్కటి నాటకం కంటె ఎక్కువ ఆనందాన్ని కలిగించింది.

సైకిలు పోయిందనే విషయమే మర్చిపోయి వెళ్ళిపో బోతూంటే ఇంకో పోలీసు లోపలికి చక్కావచ్చాడు. వచ్చీ రావడంతో ఒక్కక్షణం నాకేసి చిత్రంగా తేరిపారజూచి స్నేహితుడిలాగా నా బుజంమీద చెయ్యివేశాడు.

ఒక్క నిమిషంతాళితే సంగతేమిటో తెలుస్తుందిగా అని నాలో నేను అనుకున్నాను. సైకిలు దొంగను అరెస్టు చేశాడేమో! సైకిలు దొరికిందేమో!

ఊహూఁ-అదేంకాదు. వాడు పోలీసు ఏజెంటు. వెనకటి రోజుల్లో నావెంటబడుతూండేవాడు. ఇప్పుడు మళ్ళీ నన్ను

గుర్తుపట్టాడు. నా దగ్గిరనించి ఏవోకూంపీ తియ్యాలనుకున్నా డనుకుంటా.

"సరే. యేవిటి?" అన్నాను ఆశ్చర్యాం నటిస్తూ.

"జ్ఞాపకం లేదూ? సంవత్సరాల తరబడి మీా వెన్నంటి తిరిగాను, ప్రొఫెసర్! యిపుడు మీరు యెదో పెద్దపదవిలోనే వుండుంటారు. మీా బోటి ఫాసిస్టు వ్యతిరేకులు కాకపోతే యీా రోజుల్లో పెద్దపదవిలో యెవరుంటారు? మీామూలకంగా యెండావానకి యెంత అవస్థపడ్డాననుకున్నారు? ఎంతమందో అనేక విధాల నన్ను సొచ్చరించారు. పెద్దపదవిలో లేకేం? యిక్కడికి యెందుకు వచ్చారు? ఫాసిస్టు రోజుల్లో మీా రాక పోకల్ని రిపోర్టు చెయ్యడమే మాపని. మీారు ఫాసిస్టు వ్యతిరేకులనీ ప్రవాసంలో వున్నవాళ్ళతో వుత్తరప్రత్యుత్తరాలు జరుపుతున్నారనీ అనుమానించాం. మీాకింకా పెద్దపదవి లభించాలా? యేదయినా కమిషనులో వున్నారా? మాకు సాయం చెయ్యగలరు. మాదేముంది, బీదవాళ్ళం. మా స్థితి గతులు మీాకు తెలుసు. మమ్మల్ని కుక్కల్ని చూస్తున్నట్లు చూస్తున్నారు. యిప్పుడు మేమంటే అందరికీ అసహ్యమే. మాపని అడకత్తెరలో పోకచెక్కమాదిరిగావుంది. మమ్మల్ని రక్షించండి. యింతకీ మీారిక్కడికి యెందుకు వచ్చినట్లు? మీా సైకిలు పోయిందా? యేదీ, వూదాసైకిలా, అల్యూమినం సైకిలా?"

నన్నేకాదు, నా సైకిళ్ళనుకూడా వాడు బాగా ఎరుగు. పోలీసులు తలుచుకుంటేమాత్రం ఏదయినా ఇట్టే తెలుసుకో

గలరు. అక్కడి పోలీసులకి నా కథలో ఆసక్తి కలిగి చుట్టూ మూగారు. సైకిలు పోయిన కథంతా మళ్ళీ చెప్పాల్సి వచ్చింది. నేను ఒక కంటకనిపెట్టిచూడాల్సిన విద్రోహినని ఫాసిస్టులు భావించేవారని వినేసరికల్లా పోలీసుల ప్రాణాలు లేచివచ్చాయి. నేనేదో వాళ్ళకింత ఉపకారం చెయ్యగలనని నమ్మారు. ఈ ఫాసిస్టు వ్యతిరేకపురోజుల్లో నేనేదో పెద్ద పదవిలో ఉన్నాననే వారిఊహ! సైకిలు పోయిందనే మిష పెట్టుకుని ఏదో దర్యాప్తు చెయ్యడానికి వచ్చానని కొందరు అనుమానించడం కనిపెట్టాను. సార్జెంటు వడివడగా పూపకళ్ళు కదలాడిస్తూ కనుబొమలు ముడుచుకున్నాడు.

"ఓ పాపా! యెరుగున్నాం." అని ఒక పోలీసు కేసి తిరిగాడు.

"వాడు మొన్నమధ్య—" అన్నా డింకొక పోలీసు పాపాచేసిన దుండగం జ్ఞాపకంవచ్చేట్టుగా కనుగీటుతూ. ఇంకో పోలీసు ఊరుకొమ్మని మోచేత్తో తతిమ్మావాళ్ళని పొడిచాడు. వీళ్ళ ఈ ప్రవర్తననుబట్టి రోమ్‌లో ఉన్న దొంగలందరి సంగతీ వీళ్ళకి తెలుసుననీ, వాళ్ళని చిక్కుల్లో పెట్టే పనేదీ చెయ్యకుండా మంచిగా ఉండదలిచారనీ నిర్ధారణ చేసుకున్నాను. దొంగలని పట్టుకోవడంలో సాయపడమని ఎవరడిగినా, దొంగల పేర్లుగాని, వాళ్ళ ఆచూకీగాని, వాళ్ళేం చేస్తుండేదిగాని, ఈ గడ్డు రోజుల్లో వాళ్ళేం చెయ్యదలచింది గానీ చచ్చినా చెప్పరు. సామాన్యపు రోజులా! ప్రజలంతా హడిలిపోతున్న రోజులు! అయినా యెవరినీ అరెస్టు చెయ్యరు.

ఇంతలో ఒక పొట్టిపాటి మనిషి ఎడమవైపు గుమ్మం లోంచి చక్కావచ్చాడు. నాకన్నా ఎక్కువ తొందరపనిలో మునిగి ఉన్నట్టున్నాడు. నేనడగాలేదు, పెట్టాలేదు, తన సోదంతా వెళ్ళబోసుకుని నా ముందరే పోలీసుల్ని తిట్టిపోసాడు. అతనికో పెద్ద భవంతి ఉంది. ఏదో పెద్దమనుషులు గదా అని భ్రమపడి పై అంతస్తు అద్దెకిస్తే వాళ్ళు దానిని భోగం కొంపగా మార్చారు. అద్దె సరిగా ఇవ్వడంలేదు. అద్దె అడిగితే గలభా చెయ్యడం మొదలెట్టారు. అతను చాలాసార్లు పోలీసులకి ఫిర్యాదు చేశాడు.

పోలీసులు చాలా కాలం ఈ విషయం పట్టించుకోలేదు. అద్దెకున్నవాళ్ళని వెడలగొట్టడంలో సాయంచెయ్యమని ఆఖరి సారిగా అడుగుదామని అతను వచ్చాడు. బలే తమాషా! భోగంవాళ్ళమీద ఈగవాలకుండా కాచేపోలీసులు వాళ్ళని వెళ్ళగొట్టడం! పోలీసు ఇనస్పెక్టరు స్టేషనులో లేడు. కాచుక్కూచోవాలి.

కాచుక్కూచోవడం మహా చిరాకు. పొద్దుపోదు. ఉత్సాహపు గంటలు గంటలు ఇట్లే గడిచిపోతాయి. కాని ఏ పోలీసు స్టేషనులోనో కాచుక్కూచుంటే కాలం ఆగిపోయినట్టనిపిస్తుంది. ఏమీతోచదు. పోలీసుస్టేషనికి వెడితే మనసు ప్రశాంతంగా ఉండదు. వాళ్ళు మనల్ని స్టేషనుకు పిలిపిస్తే అనేక అనుమానాలు బాధిస్తాయి. నెత్తిమీదికి అన్యాయంగా ఏం వచ్చిపడు తుందోనని భయంవేస్తుంది. ఇక మనమంతట మనమే వెళ్ళడ

మంటే ఫిర్యాదు చెయ్యడానికేగా. అప్పుడూ మనసు ప్రశాంతంగా ఉండదు.

"మీరు, మీరు యిక్కడేం జేస్తున్నారు?" అని అతను హఠాత్తుగా నన్ను ప్రశ్నించాడు.

నా అల్యూమినం సైకిలు ఎవరో దొంగాలించారు, అందుకు వచ్చినానని చెప్పాను.

"సైకిలా? రోజుకు నాలుగయిదు వందలు యెత్తుకు పోతూంటారు!" నేను నా కథ చెప్పి అవకాశం ఇచ్చానేమో మళ్ళీ పోలీసులని దుమ్మెత్తిపోయసాగాడు.

"పోలీసువాళ్ళు, అధికారులు వట్టి దగుల్బాజీలనుకో. జలగల్లాగా మనుషుల రక్తం పీల్చేస్తారు. మూటలు కడతారు. అప్పుడు వాళ్ళు చంటిపిల్లలకి పాలు తాగిస్తున్నారా, నెత్తురు తాగిస్తున్నారా అని మనకి అనిపిస్తుంది. ఒకొక్కప్పుడు వాళ్ళే ఇంత కొండదున్నకుంటే బావుండేదని అనుకుంటారు. వాళ్ళకి దయాదాక్షిణ్యాలంటూ వుండవు. చచ్చి వకళ్ళు యేడుస్తూంటే వీళ్ళు సంతోషిస్తుంటారు."

అతనికి మతి తప్పినట్టుంది. మళ్ళీ అన్నాడు: "యిదంతా యెరిగుండీ యేంచెయ్యను! వీళ్ళ సాయంకోరుతున్నానంటే యిష్టంవుండా?"

పోలీసు ఇనస్పెక్టరు చక్కావచ్చి, అతను చెప్పిందంతా విన్నాడు. బుజాలు ఎగరవేసి తన చెయ్యగలిగిందేమీ లేద

న్నాడు. ఇదంతా పది నిమిషాలలో జరిగిపోయింది. అతను పోలీసులమీద మరింత మండిపోతూ, నాతో వెళుతున్నానని అయినా చెప్పకుండా చక్కాబొయ్యాడు.

ఇక నావంతు వచ్చింది. నా కథంతా చెప్పాను. సైకిలు దొంగిలించడమే గాక పైపెచ్చు నామీద దాడి చేశారనీ ఎలాగో తప్పించుకుని బైట పడ్డాననీ విశదపర్చాను.

ఇనస్పెక్టరు పాపాని స్టేషనుకు పిలిపిద్దామన్నాడు. కాని అందువల్ల ప్రయోజనమేముంటుంది? పాపా ఒక్కడే రాడు. వాడి ముఠాకే ఇది ముప్పు. తోడిదొంగల్ని వెంటబెట్టుకుని మరీ వస్తాడు. పాపా, నేనూ ముఖాముఖీ ఎదుర్కొంటే ఏం జరుగుతుంది?

పాపా నా సైకిలు దొంగిలించాడని నేను వాదించాలి. కాని ఒప్పుకుంటాడా? ఉహుం-కూడా తన ముఠావాళ్ళని తీసుకొచ్చి తప్పుడుసాక్ష్యమిప్పిస్తాడు. ఇక నేనేంసాక్ష్యం తీసుకురాగలను! నిన్నా మొన్నా దొంగలబలం నాకు తెలిసొచ్చింది. చెప్పులదుకాణాదారుని అడిగితే తాను దొంగని చూడనే లేదని బుకాయించాడు. అప్పుడు నేను దొంగ మొహంకేసి వేలెత్తి చూపుతూ, "వాడివాలకమేం బావుండలేదు." అన్నానుకూడా. ఆ చౌకులో వాళ్ళంతా దొంగని చూచారు.

ఒక విషయం నాకిపుడు జ్ఞాపకం వచ్చింది. అప్పుడయితే అది ముఖ్యమయిందనిపించలేదు. సైకిలు పోయిందని నేను గోలపెడుతూంటే ఒక ముసలమ్మ వేలుపెట్టి చూపుతూ 'అక్కడ'అని చెప్పింది. 'అక్కడ' అంటే మాంటీ బజారను

కున్నాను. కాని ఆవిడ వేలెత్తి చూపింది పాపాదుకాణం. ఏం చెయ్యాలి? వెళ్ళి ఆ ముసిలమ్మని తీసుకురానా? కానిపోలీసు వాళ్ళముందు మాట్లాడడానికి ముసిలాళ్ళు భయపడిపోతారు.

ఇక నా తరఫున సాక్ష్యమిచ్చేదెవరు? బండివాళ్ళా? ఊహుఁ—వాళ్ళకలాంటి ఉద్దేశమేఉంటే పాపాని అప్పుడే పట్టిచ్చేవాళ్ళు. వాళ్ళు పాపాని రోజూ చూస్తూనే ఉంటారు. యదార్థానికి బండివాళ్ళు, దొంగలు ఒకటే. అందుచేత ఒక్కడూ నా తరఫున మాట్లాడడు. ఏం జరిగేదీ ఊహించుకోవడం ఏమంత కష్టంకాదు. పోలీసులముందు పాపా కోపం వచ్చినట్టు నటిస్తాడు. ఇనస్పెక్టరేమంటాడు? 'నోరు పారేసుకోకు. అన్యాయంగా దొంగతనం అంటకట్టారనుకుంటే వెళ్ళి దావా వేసుకో' అని వాడికి చెప్పి, నన్ను ఇక వెళ్ళిపొమ్మంటారు. స్టేషనుముందు కాచి పాపా స్నేహితులు నాతాళం పట్టిస్తారు. సైకిలుకోసరం వాళ్ళచేత తన్నులు తినడమేమిటి? పుణ్యమా, పురుషార్థమా?

పోలీసుఇనస్పెక్టరు నిజంగా నాకు సాయం చేస్తాడను కుందాం. పాపాని వెతకమనిగాని, వాడి స్నేహితుల్ని పట్టుకు రమ్మనిగాని పోలీసులకి ఆజ్ఞాపిస్తే అతని ఆజ్ఞను పాటించే దెవరు! మటనాటోరోడ్డులో ఫలానాచోట దొంగల రహస్య స్థావరం ఉందనీ, దానికి దగ్గిరలోనే దొంగసైకిళ్ళు దాచే వాళ్ళున్నారనీ చెబుతాననుకో, చెప్పినా ఇనస్పెక్టరు ఎవరినీ అరెస్టూ చెయ్యడు, దర్యాప్తూ చెయ్యడు. అతనికీ, అతని మనుష్యులకీ దొంగల గుట్టు మట్లన్నీ తెలుసు. అయినా సాహసించడు. కావలిస్తే మనచేతులే కాల్చుకోమంటాడు.

ఇనస్పెక్టరు చెప్పినట్లు పాపాని స్టేషనుకు పిలిపించిఉంటే నేను అపాయంలో చిక్కుకునేవాణ్ణిని. సైకిలు వెదకడం సాధ్య పడేదికాదు. పాపాయే నా సైకిలుదొంగ అని నేను వాదించినా ప్రయోజనం ఉండదు. పైగా కొత్తచిక్కుల్లో చిక్కు కుంటాను.

ఇదంతా బాగా ఆలోచించి నేను రాసిచ్చిన రిపోర్టు సరిచేసి తిరిగి రాసిస్తానని పుచ్చుకున్నాను. రిపోర్టులోంచి దొంగ పేరు తీసేసాను. నేనిలా చెయ్యకపోతే పోలీసులు పాపాను పట్టుకున్నన్నారావాలి లేకపోతే నా రిపోర్టు బుట్టదాఖలన్నా చెయ్యాలి. ఈ రెండూ పోలీసుల్ని ఇరకాటకంలో పెట్టేవే.

హఠాత్తుగా జేబులోంచి గడియారం తీసిచూసాను. నుదురు కొట్టుకుంటూ, "మతిమరుపు వెధవని! పన్నెండున్నర కల్లా అరోరా వారపత్రిక ఆఫీసులో వుండాలి. అప్పుడే పన్నెండుంబావు అయింది." అనుకుని తొందర తొందరగా బయలుదేరి చక్కాబోయాను.

మెట్లు దిగబోతూంటే ఒక పోలీసువచ్చి నన్ను కలుసుకున్నాడు. వాడు ఒక్కమాటన్నా మాటాడకపోయినా నా కథంతా శ్రద్ధగావిని అందరికన్నా ఎక్కువ విచారంవెలి బుచ్చాడు. నా ముందు మర్యాదగా, అతివినయంగా నిల్చుని, "వక వుపకారం చేస్తారా?" అని అడిగాడు.

"అసలువిషయ మేవిటో చెప్పకుండా వుపకారం చెయ్యమంటే యేం చెయ్యగలను?"

"మెట్లమీద మాట్లాడుకుందాం, రండి."

మెట్లమీద మాట్లాడదామనడంలో వాడి ఉద్దేశ మేమిటో నాకు బోధపడలేదు. ఆశ్చర్యంగా వాడికేసి చూసాను. ఆ విషయం తనకూ, తనకొడుక్కీ మాత్రమే సంబంధించిందనీ తోటి పోలీసులు వినడం తన కిష్టంలేదనీ వాడు చెప్పాడు. అ ఇందాకటి ఇంటియజమాని వెళ్ళిపోయే ముందు "పోలీసువాళ్ళని జన్మలో నమ్మకు." అని నన్ను హెచ్చరించాడు. అందుకని నా జాగ్రత్తలో నేనున్నాను.

ఆ పోలీసు ఒక తలుపు తెరిచాడు. మెట్లు కనిపించాయి. అక్కడ అంతా చీకటిగా ఉంది. ఆ చీకట్లో ఒక యువతి కని పించింది. ఆమె మాంచి అందమయింది, మంచి వయసులో ఉంది. అద్దాలు అమర్చిన ఇంకోతలుపువెనక ఆమె నిల్చుంది.

ఆమె తనభార్య అని పోలీసు చెప్పాడు. నిజమో అబద్ధమో భగవంతుడికి తెలియాలి! ఆ కపటభర్త, ఒక కపట పుత్రుణ్ణిగురించి చెప్పసాగాడు. నిజంగానే వాడికో కొడు కున్నాడేమో, చెప్పలేం నన్ను పూర్వం వెంటాడిన పోలీసు 'ప్రొఫెసర్'అని నన్ను పిల్చాడు. వీడూ ప్రొఫెసరుతో కొడు కునుగురించి చెప్పినట్టే నాతో చెప్పడం మొదలుపెట్టాడు. తొందరగా చదువు పూర్తి కావాలనే ఉద్దేశంతో ఆ కుర్రాడిని టోబియోలో ప్రైవేటు స్కూలులో ప్రవేశపెట్టారు. కిందటి సంవత్సరం ఆ కుర్రాడు బారీలో చదివాడు. బారీనగ రంలో ఉండేవాళ్ళంతా వట్టి చవటదద్దమ్మలు. అయితేనేం వాళ్ళపనే దినదినాభివృద్ధిగా ఉంది. వాడి భార్య నను చూసి తియ్యతియ్యగా మందహాసం చేసింది. ఫ్రియూలియన్ మాండ

లిక్ భాషలో చక్కగా మాట్లాడింది. బారీలో ఉండే ఈ పురుషుడు ప్రియలీకి చెందిన ఈ స్త్రీని వివాహ మాడాడు! లేకపోతే ఉంచుకున్నాడేమో! ఇది చాలా విచిత్రమయిన విషయం. సామాన్యంగా ప్రియాలీ స్త్రీలు ఒక్కడినే అంటిపెట్టుకుని ఉండేరకంకాదు. వాడు తెలివితక్కువ వాడేంకాదు. మరీ సంబంధం ఎలా పొసగిందో?

ఆ కుర్రాడిని చూడడానికి ఇంటికి రమ్మని ఆ పోలీసు నన్ను ప్రోత్సహించాడు. పోలీసు స్టేషనుకుగాని, కోర్టుకిగాని వెళ్ళాల్సి ఉన్నపుడులాగానే ఇపుడూ తొందరగా వెళ్ళిపోవాలనుకున్నాను. అయినా వాళ్ళ ప్రశ్నలకు ఉద్రేకంతో,'అవును,' 'కాదు.' అనే ముక్కలలో సమాధానం ఇస్తూనే ఉన్నాను. తొందరగా నేను వెళ్ళదలిచానని తెలిసీ వాడు తన కొడుకు విషయం అంతూపొంతూ లేకుండా చెప్పుకుపోతున్నాడు. రాజకీయ అల్లకల్లోలాల మూలకంగా బారీలో ఆ కుర్రాడి చదువు సరిగా సాగలేదు! ఒకటో తరగతినించి మూడో తరగతికి ఒకసారే గెంతాలని ప్రయివేటు స్కూలులో ప్రవేశపెట్టారు.

"మీారేమంటారు, ప్రొఫెసర్!"

"కుర్రాడిని చూట్టానికి ప్రొఫెసరుగారు మనింటికి వస్తున్నారుగా!" అందామె చిరునవ్వు నవ్వుతూ. నే చూసినంత వరకు ఇంత సిగ్గువిడిచి ఏ వ్యభిచారిణీ ప్రవర్తించలేదు.

"బలవంతం చెయ్యకు. ప్రొఫెసరుగారేదో తొందర పనిమీాద వెళుతున్నట్టున్నారు." అంటూ అడ్డం వచ్చాడా

భర్త. వాళ్ళ ఇంటికి వెళ్ళడం, మానడం నిర్ణయించేది తనే ననీ, ఒప్పుకోవడమే నా వంతనీ అనిపించేట్టు ఇంకా అన్నాడు: "రాత్రి యెనిమిదింటిదాకా నేనిక్కడనించి కదలడానికి వీల్లేదు. అందాక యెందుకు, యీ మెట్లువదిలి గేటుదాకా మిమ్మల్ని పంపించడానికి వచ్చే వీలూలేదు."

మళ్ళీ ఇంకోమాటు ఆమె తనతో సన్నిహిత సంబంధం కుదుర్చుకుంటే డబ్బుఖర్చు అట్టే ఉండదని నాకు నమ్మ పల కాలని చూస్తూ కుర్రాడి చదువు సంగతి చెప్పింది.

నేను పోలీసుస్టేషనునించి బయలుదేరి తిన్నగా ఇంటికి చేరుకున్నాను. సైకిలు వ్యవహారం చిక్కుల్లో పడింది. అందుకని కొంతకాలంపాటు సైకిలుకోసరం వెతకడం కట్టి పెట్టేద్దామనుకున్నాను. ఇక దొరికిచావదని నాలో నేను విచార పడ్డాను. ఈ క్షణంలో నా సైకిలును దొంగలు ఏభాగాని కాభాగం ఊడగొట్టుతూండచ్చు లేదా ఏ పోలీసు వాడి సలహా ప్రకారమో ఈపాటికి ఊడగొట్టేసి ఉండచ్చు, పోలీసు ఇనస్పెక్టరు ఇలాంటి ప్రమాదం ఉందని సూచించనే సూచిం చాడు.

ఈపాటికి ఏభాగానికాభాగం, ఏబోల్టుకాబోల్టు, ఏశీల కాశీల ఊడగొట్టేసుంటారు. ఇవాళ ఒక హాండిలుబారు పిడి, రేపు రెండోది అమ్ముతారు. ఊహుం-ఈ తడవ అలాచెయ్యరు. నేను దొంగవస్తువులను పట్టుకోవడంలో దిట్టనని ఈపాటికే

గ్రహించి ఉంటారా, ఏభాగానికాభాగం ఇవాళే అమ్ముతారో, రేపే అమ్ముతారో, కొన్ని నెలల పర్యంతం అసలు అమ్మరో, అమ్మినా ఎక్కడ అమ్ముతారో? సంవత్సరం అయి పోయాక సైకిలురంగు, హాండిలుబారు ఆకారం ఎవరికి జ్ఞాపకం ఉంటుంది? నేను నా సైకిలులోని ప్రతి ముక్కనూ గుర్తుపట్టా లంటే సాధ్యమవుతుందా? పోలీసులు దొంగల్ని అరికట్టరు. పైగా తప్పించుకోడానికి వాళ్ళేం చెయ్యాలో చెబుతారు. ఇక సైకిలుకు తిలోదకాలివ్వడం మంచిది.

నాకేమీ పాలుపోలేదు పదిహేనువేల లీరాలుపోసి కొన్న అల్యూమినం సైకిలు పోతేపోయిందిలే అనే ధోరణిలో పడ్డాను. కాని దరిద్రుడు ఎంత చెమటోడిస్తే పదిహేనువేల లీరాలుపెట్టి సైకిలు కొనగలుగుతాడు! దొంగ అనే ముద్ర వేయించుకోకుండా పోయిన సైకిలుకు బదులు ఇంకొకరి సైకి లును దొంగిలించి, రోజుకు పదిహేనువేలు సంపాదించే బాపతు వాళ్ళకి పదిహేనువేలు పెద్ద లెక్కకాదు. పదిహేను రోజుల కాయకష్టం! అంతే.

కాని ఇటలీలో కాపీరైటు హక్కులు ఎన్నడూ సరిగా అమలులోకి రాలేదు. సామాన్య రచయితకి పూర్వమూ ఇప్పుడుకూడా ఏడు పుస్తకాలో, డెభై వ్యాసాలో కష్టపడి రాసి అమ్ముకుంటేనేగాని పదిహేనువేలు గిట్టవు. అంతేకాదు నేటికీ చాలామంది పబ్లిషర్లు ఒక్క చిల్లిగవ్వయినా ఎక్కువ ఇవ్వకపోగా రావలసిన కమిషనుకూడా పూర్తిగా ఇవ్వరు. లేకపోతే ముందుగా రెండువేలు చేతిలోపెట్టి ఆ తర్వాత

ఆ పుస్తకం రాజకీయపు చిక్కులు తెచ్చిపెట్టిందనో, పుస్తక దుకాణాదారులు డబ్బివ్వలేదనో వంకపెట్టి తతిమ్మాసొమ్ము ఎగవేస్తుంటారు. పబ్లిషర్లకి కావలసినన్ని వంకలు దొరుకు తాయి. ఇక రచయిత పదివేల లీరాలు ఖరీదుచేసే బూట్లువేసు కుని, వేయి లీరాల బస్సులకింద తగలేసి సంపాదకులచుట్టూ తిరగాల్సి ఉంటుంది. చివరికి బూట్లఖరీదు, బస్సుచార్జీలు, కాగితం, సిరాఖర్చు, టైపుచార్జీలు మొత్తం లెక్కచూసు కుంటే సంపాదనకంటె ఖర్చు ఎక్కువవుతుంది.

ఇంతాచేస్తే టైపిస్టు దగ్గరనించీ చెప్పులు అమ్మేవాడి దాకా, "గిట్టి చావనప్పుడు రాయడమెందుకు?" అనేవాడే. చీకటి బజారులోనేమో, ఈ కల్లోల కాలంలో నేమీ బుద్ధిజీవులకు విలువలేదు.

నా సైకిలును పట్టుకొని పదిహేనువేల లీరాలు ఆదా చేసుకుంటానికి కొత్తమార్గం అవలంబించాలని నిశ్చయించు కున్నాను. అంతేకాదు నాకు జరిగిన ఈ అవమాన్ని గురించి ఒక పుస్తకంకూడా రాయాలని తలపెట్టాను. నేను రోమ్‌లో ఉన్న ఈ మూడేళ్ళల్లో నా సైకిళ్ళు అయిదింటిని దొంగలు కొట్టేశారు. కాని వాటిలో రెంటినిమాత్రం తిరిగి పట్టుకో గల్గాను.

మొట్టమొదటిసారిగా నా స్టూడియోలోంచి సైకిలు కొట్టేశారు. అసీరా అనే నా మోడలు, ఒక కుంటిది, దాని మొగుడూ కుమ్మక్కయి నా గదితాళాలు బద్దలు గొట్టి సైకిలు ఎత్తుకుపొయ్యారు. నూనె బజారు వె

దానికి వాళ్ళకి సైకిలు కావల్సివచ్చింది. ఆ స్త్రీ లిద్దరూ ఆ నూనె దొంగకి నేను సైకిలు ఎక్కడ పెట్టిందీ చూపించారు. ముగ్గురూకలిసి సాయంత్రమో, తెల్లవారగట్లో దొంగతనానికి చక్కావచ్చారు. నా స్టూడియో ఉన్న ఇంటి ఆవరణ నిండా చెట్లూచేమలూ దట్టంగా ఉన్నాయి. ఇక దార్వాన్ వాడికి పనితో ఊపిరాడదు. అజాగ్రత్తమనిషి. దొంగలు ముగ్గురూ ఎలాగో మెల్లిగా స్టూడియో దగ్గిరికి చేరుకుని సుత్తి, సావణం మొదలయిన పనిముట్లతో నా గది తాళం బద్దలుకొట్టి సైకిలు తీసుకు చక్కాబొయ్యారు.

మర్నాడు ఉదయం ఆకుంటిది నా గదిలోకి చక్కా వచ్చింది. చెప్పడం మరిచాను. అది కుంటిదే గాని మంచి అందగత్తె. ఒకప్పుడు దానికీ నాకూ ప్రేమసంబంధం ఉండేది. తర్వాత తర్వాత మొహం మొత్తి దాంతో తెగతెంపులు చేసుకున్నాను. వచ్చీరావడంతో స్రృంగార చేష్టలకి దిగింది. అదంటే నాకు మొహం మొత్తడమే కాకుండా ఆనాటి ఉదయం ఎందుకో నాకు చిరాగ్గా ఉంది. దానిపీడ వదలించుకునేందు బయటికి బయలుదేరాను.

ఇద్దరం వీధిదాకా వెళ్ళాం, సైకిలు వేసుకుని నగరం బైటికి వెళ్ళి కాస్సేపు పొలాలలో తిరుగుతూ విశ్రాంతి తీసుకుంటే చిరాకు తగ్గుతుందని భావించాను. కుంటిదిమాత్రం నన్ను సైకిలుకోసం వెళ్ళకుండా నిరుత్సాహపరుస్తూ "యిద్దరంకలిసి కాలినడకను అలా బజారు వెడదాం." అంది. తగిన కారణం కనిపించకపోయినా నాకెందుకో అనుమానం వేసింది.

అశాభంగం పొందిన స్త్రీ యే పనికయినా తెగిస్తుంది. అది కంపించిపోతోంది. దానితోకూడా బజారుకు వెళ్ళినా తిరిగి వచ్చేటప్పుడు కాలినడకను రావడంలో అర్థంలేదు. సైకిలుమీద రావడం ఉత్తమం. దానిని ఆగమని సైకిలుకోసం షెడ్డుకు వెళ్ళాను. ఆశ్చర్యం! ఆశ్చర్యం! షెడ్డు తాళం పగలగొట్టి ఉంది. లోపలికి ఉరుక్కుంటూ వెళ్లాను. ఏముంది! సైకిలు లేదు. పరుగెత్తుకుంటూ బయటికి వచ్చాను. సైకిలు పోయిన సంగతి విని అది కంగారుపడలేదు, ఆశ్చర్యం ప్రకటించలేదు. ఇంటికి తొందరగా వెళ్ళిపోవాలనే ఆదుర్దామాత్రం దానిలో కొద్దిగా గోచరించింది. దీంతో నాకు అనుమానం ఎక్కువయింది. అసిరాకీ దీనికీ మాత్రమే నేను తరుచు సైకిలు షెడ్డులో పెడతానని తెలుసు.

ఈ దొంగతనం విషయం ఏదో నేను తేల్చుకోవాలి. వెళ్ళిపొమ్మని కుంటిదానితో చెప్పాను. ఇటువంటి సందర్భాలలో పోలీసులకి ఫిర్యాదు చేసినా లాభంలేదు. ఎవరితిప్పలు వాడే పడాలి. అందుకు వెంటనే ఇంకో సైకిలు వేసుకుని దొంగలవెంట పడడం ఒక్కటేమార్గం. రెండు సంవత్సరాల కితమయితే ఇది చాలా తేలికపని. సరసమయిన ధరకి కొత్తసైకిలు దొరికింది. అదృష్టవంతుణ్ణి! కొత్త సైకిలు వేసుకుని పాతసైకిలు వెతకడానికి రోమ్‌నగర వీధులన్నీ తిరిగాను. నా మొదలు, కుంటిది. దాని మొగుడు నివసించే ప్రాంతానికి చేరువలోని వీధిలో తిరగనారంభించాను.

నాకు మంచి జ్ఞాపకశక్తి ఉంది. ఒకరోజు నేను ఆ స్త్రీ లిద్దరితో వాళ్ళకొంపకు వెళ్ళాను. తోవలో అసిరా ఒకతనితో మాట్లాడడానికి ఆగింది. అతను సైకిళ్ళు అమ్ముతూంటాడు. అసిరాను చూచికను గిలిపాడు. వాళ్ళిద్దరికీ సంబంధం ఉందని ఎవరికీ అనుమానం తగలకుండా ఉండేందుకు ఆమె ఆగి వాడితో నాలుగుమాటలు మాట్లాడింది.అయినా స్త్రీ పురుషుల మధ్యగల సంబంధం తెలుసుకోవడం ఏమంత కష్టంకాదు. ఆమెకి మంగలి వాళ్ళతో, హోటలువాళ్ళతో, మాంసం అమ్మేవాళ్ళతో బాగా స్నేహం ఉంది. వాళ్ళకోరిక తీర్చినందుకు డబ్బుకు బదులుగా సారా, రొట్టెలు, సబ్బులు, అత్తర్లు ఇస్తూంటారు. బీదయువతులకి తిండికంటె అత్తర్ల మీద మోజు ఎక్కువగా ఉంటుంది.

సైకిలు వెతికి పట్టుకోవాలనే ధ్యాసతో ఆమె ఇల్లంతా గాలించాను. మొదట్లో ఆ వీధిలోవాళ్ళని ఆమె సైకిలు మీద వెళుతూండగా చూసారా అని ప్రశ్నించాను.లేదన్నారు. దాని మీద ఏదోవంక పెట్టుకుని ఇంట్లోకి వెళ్లాను. వంటిల్లంతా పొగచూరి ఉంది. ఒక చెక్కపెట్టెను మేజాగా, మరిరెండు చెక్కపెట్టెలను కుర్చీలుగా ఉపయోగిస్తున్నారు. పడకగదికీ, వంటగదికీ మధ్యగుమ్మానికి తలుపంటూ లేదు. బహుశా అసిరా ఆ తలుపు పీకేసి పొయ్యిలోపెట్టి ఉంటుంది. పాపం! బీదవాళ్ళు ఇలాగే చేస్తుంటారు. ఆకలిగొన్నప్పుడు చేతికి దొరికిందల్లా నాశనం చేసేస్తారు.

వంటగది మధ్య పెద్ద డబ్బామీద అసిరా తమ్ముడు కూర్చుని ఉన్నాడు.

"మీ అక్క యేదీ?"

"తెలీదు."

"యెక్కడికి వెళ్ళింది?"

"తెలీదు."

"మీ అక్క వుందా?"

"తెలీదు."

"వక్కడిపీ యింట్లో యేం చేస్తున్నావ్?"

"తెలీదు."

"చలేయడం లేదూ?"

"తెలీదు."

"తెలీదూ?" అది బిగ్గరగా కేకేసాను.

"చలేస్తుందనే సంగతే తెలీదు. పిచ్చివేషాలు వెయ్యక వెళ్ళి వెచ్చగా పడుకో."

తోక ముడుచుకుని కుక్క కొట్టాంలోకి వెళ్ళినట్టే ఆ కొంటెవెధవ లోపలికి చక్కాబొయ్యాడు. లోపలికి వెళ్ళి మాసిపోయి వాసన కొడుతున్న దుప్పటి కప్పుకున్నాడు. పక్కదుప్పట్లు చినిగి చీలికయిఉన్నాయి. అసిరా మంచి అందగత్తె. వంక పెట్టడానికి వీల్లేని శరీరసౌష్టవం. అలాంటిది ఇలాంటి దుప్పట్లు పక్క వేసుకుని గోడిగలాగా విటుడితో గంటలకి గంటలు గడుపుతోంది. కాని నాకు మోడలుగా పని చేసేటపుడు పది నిమిషాలపాటు కుదురుగా ఉండలేదు.

పరుగెత్తుకుంటూ వచ్చి నన్ను ముద్దెట్టుకునేది. నిజమయిన చిత్ర కారుడెవడూ మధ్యలో మోడలు ఇలా లేచి చక్కావచ్చి ముద్దెట్టుకోవడం సహించడు.

అయితే నా సైకిలు ఆమె ఎందుకు దొంగిలించింది? ఇది సహజమయిన ప్రశ్న. ఆమెకి ప్రియుణ్ణని అనుకున్నంతసేపూ నాకు సమాధానం తోచలేదు. నేను నవలాకారుణ్ణి. ఆ దృష్టితో ఆలోచించేసరికి అంతా బోధపడింది. ఎందుకు దొంగిలించింది? ఆకలికి తాళలేక. ఆ కొంపలో దుర్భరజీవితం భరించలేక. ఆ కుంటిదాని మొగుడు అసిరాకి ప్రియుడు. వాడి మాట తీసెయ్యలేక నా సైకిలు దొంగిలించింది. సైకిలు లేకుండా నూనెకోసం దూరం ఎలా వెళ్ళగలడు? వాడు చీకటి వర్తకం చేస్తుంటాడు. అబ్బ! చీకటి వర్తకం! ఎంతమంది దరిద్రులు చీకటి వర్తకంచేసి భాగ్యవంతులుకాలేదూ! రోజులు మారేసరికి యథాప్రకారం దరిద్రులుకాలేదూ! సైకిలు లేకుండా దొంగతనం చెయ్యడం ఎట్లా? అందుకని కుంటిదాని మొగుడు ఒత్తిడిచేస్తే అసిరా లొంగిపోయింది.

తాళం బద్దలుకొట్టడానికి సుత్తి సావణం, అక్కర్లేదు. దానినిబట్టి అసిరా, కుంటిది, దాని మొగుడు దొంగతనం వృత్తిగా పెట్టుకోలేదని తేలింది. అంతేకాదు మహా తొందర పడ్డారు. సావణం నేలమీదపారేసి పారిపొయ్యారు. నేను దానిని తీసి చేతిసంచిలో దాచాను. ఇప్పుడు పైకి తీసి ఆ కుర్రాడికి చూపుతూ "యిది మీ అక్క మెట్లమీద పారేసుకుంది. తీసుకో." అన్నాను.

"అది మా అక్కడికాదు. మా అక్కకి అసలు సావణంలేదు. అది కుంటిదానిది." అన్నాడు సావణంకేసి చూస్తూ.

కుంటిదానికి సావణం ఎందుకు? అసలు ఈ సావణం కుంటిదానిదని నీ కెలా తెలుసు? అని గుచ్చిగుచ్చి అడిగాను. సావణం ములుకులు కేసి చూపాడు. ఒకటి పొట్టి, ఒకటి పొడుగు. ఒక పెట్టి తెరవడంలో ఒక ములుకు విరిగిపోయిందట. ఆ కొంటె కుర్రాడు 'తెలీదు' అనే ముక్కమానేశాడు. అడిగినదానికల్లా చక్కగా జవాబు చెబుతున్నాడు. కబుర్లు చెప్పి సావణం తీసుకోవాలని వాడి ఉద్దేశం. అది కుంటి దానిది. కుంటిది వాళ్ళ స్నేహితురాలాయె. అయితే సావణం వాడికి ఇవ్వడానికి నేను నిరాకరించేసరికి ఏడుపు మొదలెట్టాడు. వాడిని కొంచెం ఓదార్చి అసిరా ఎక్కడుందో తెలుసుకుందా మని, "మీాఅక్కచేతి కిస్తాలే. యెక్కడికి వెళ్ళిందోచెప్పు? వెళ్ళి యిచ్చొస్తా," అన్నాను. వాళ్ళ అక్క, కుంటిదీకలిసి వెళ్ళా రనీ అంతకంటె ఎక్కువ తనకేమీా తెలియదనీ వాడుచెప్పాడు.

వాళ్ళిద్దరూ ఎక్కడికి వెళ్ళుంటారు? ఉదయం ఎనిమిది గంటలప్పుడు కుంటిది నా దగ్గరేఉంది. తరవాత కొత్తసైకిలు కొనడానికి గంటపట్టింది. ఆ తరవాత నేను అసిరా ఇంటికి వెళ్ళాను. ఈ లోపున కుంటిది ఇంటికి పరుగెత్తుకువెళ్ళి వాళ్ళ మీాద నాకు అనుమానం తగిలిందని భర్తతో చెప్పి ఉంటుంది.

దురదృష్టవశాత్తు కుంటిదాని మొగుడు నా సైకిలును గుర్తు పట్టకుండా మార్చేస్తున్నవాడిదగ్గిరికి హడావిడిగా పరిగెత్తుంటాడు. అసిరానీ, కుంటిదాన్నీ, సైకిలు వర్తకుణ్ణీ పట్టుకోవడం ఏమంత కష్టంకాదు. సైకిలు తొక్కుకుంటూ వెళ్ళి మొదటగా తగిలిన సైకిలుదుకాణం దగ్గిర దిగి మర్యాదగా దుకాణాదారుని సైకిలుసరేసు ఉందా అని అడిగాను. సరేసు దొరకడంలేదని నాకు తెలుసు. దొరికేవస్తువు అడిగితే కొనవలసివస్తుంది. ఇపుడు ఆ చిక్కు లేదు.

వాడు జవాబు చెప్పలేదు. నాకూ కావల్సిందదే. జవాబుకోసం ఎదురుచూస్తున్నట్టుగా నిల్చుని దుకాణంఅంతా కలయజూచాను. నా సైకిలు కనిపించలేదు. విడిభాగాలేమయినా కనిపిస్తాయేమోనని చూచాను. అవీ కనిపించలేదు. అక్కడినించి పక్కదుకాణానికి వెళ్ళి ఇదే నాటకం అక్కడా ఆడాను.

క్లుప్తంలో చెప్పాలంటే మూడునాలుగు చౌకులు, ముప్ఫయి వీధులు తిరిగాను. లాభం లేకపోయింది. ఆ కిందటి సాయంత్రం అసిరాతో మాట్లాడిన సైకిలు వర్తకుడి దుకాణానికి వెళ్ళడం మంచిదని చివరికి తోచింది. పోయినవస్తువు దొరికితే ఆనందానికి మితిఉంటుందా! నేను "అదుగో దొంగ! నా సైకిలు దొరికింది! యిదిగో! యిదిగో!" అని అరుస్తూ పిచ్చి సంతోషంతో సైకిలుదుకాణంలోకి ఉరుకుంటూ వెళ్ళాను. అక్కడ ఒక కుర్రాడు నా సైకిలు ఊడికొట్టేస్తున్నాడు. నేను వెళ్లేసరికి డైనమో, ఎలక్ట్రిదీపం ఊడదీస్తున్నాడు. నా డైనమోలాంటివి అనేకంఉన్నాయి. కాని చక్రా

నికి దగ్గిరగా డైనమోమీద ఎర్రటి మరకయింది. మరకనిబట్టి సైకిలును ఎప్పటికయినా గుర్తు పట్టచ్చని చెప్పి చెరిపేయలేను. సైకిలునెంబరు నోటుపుస్తకంలో రాసిపెట్టి ఉంచాను. అంతే కాదు, సీటుకింద చెరగని పెనిసిలుతో నాపేరు రాశాను. ఇంకేం? అక్కడ గుమిగూడిన జనానికి ఆ సైకిలు నాదని నచ్చ చెప్పడం తేలికయింది.

ఇంతలో ఇద్దరు పోలీసులు చక్కావచ్చి, నేను గొడవ చేసినందువల్ల దొంగ పారిపోయ్యాడని నామీద నిష్టూరం వేశారు.

"అసలు దొంగెక్కడున్నాడు? దుకాణాదారుకూడా యిక్కడలేడు." అని నేను సమాధాన మిచ్చాను. నేను కేకలు వేసి జనాన్ని పోగుచేశానని పోలీసులు మండిపడ్డారు. కేకలు వెయ్యకపోతే జనం ఎలాపోగవుతారు? జనం పోగుకాకపోతే ఏమయేది? దుకాణాదారు చక్కావచ్చేవాడు. నేను చూడ కుండా పోలీసులకి లంచమిస్తానని సైగచేసేవాడు. పోలీసులు నన్ను స్టేషనుకు లాక్కుపొయ్యేవారు. ఈ లోపున నేను పట్టు కున్న సైకిలు దాచేసి ఇంకో సైకిలు దానిస్థానంలో అట్టేపెట్టే వారు. అనవసరంగా దొంగతనం కట్టానని కేసు నామీద ఎదురు తిరిగేది. దుకాణాదారు నామీద పరువునష్టందావా వేసేవాడు. వాడికి కావలసినంత సాక్షి దొరికేది. ఈ ఊబి లోంచి బయటపడడానికి ఎన్ని తిప్పలు పడవలసివచ్చేదో?

దుకాణాదారు అయిపులేడు. బహుశా ఎక్కడికన్నా వెళ్ళి దాక్కున్నాడేమో! నా సైకిలు తీసుకుని, పోలీసు వాళ్ళతో నాకు ఫిర్యాదు చెయ్యాలని లేదని చెప్పి పంపించేశాను. రెండు సైకిళ్ళూ రెండు చేతుల్తో పట్టుకుని ఇంటికి నడిపించుకుని వెళ్ళాను.

ఇంతటితో ఊరకుంటే లాభంలేదని పోలీసుస్టేషనుకు వెళ్ళి సైకిలు వర్తకుని అరెస్టుకు వారంటు జారీచేయించాను. సాయంత్రానికల్లా సైకిలు వర్తకుణ్ణి పట్టుకు తీసుకువచ్చారు. దొంగవస్తువులు కొన్నాడని అతనిమీద కేసు పెట్టాను. ఆ సైకిలు ఒకరు మరమ్మతు చెయ్యడానికి తెచ్చి ఇచ్చారని అత నెవరో తనకు తెలియదనీ వాదించడం మొదలుపెట్టాడు. కాతాదార్ల చిట్టా అట్టేపెట్టడం అలవాటు లేదన్నాడు. అంత మాత్రాన అతను దొంగవస్తువులు కొంటూంటాడని నిర్ధారణ చెయ్యడం ఎట్లా! అసిరా, కుంటిది ఆ సైకిలును అతనికి తెచ్చి ఇచ్చిఉంటారని నా నమ్మకం. అందుకని వాళ్ళనికూడా ముద్దాయిలుగా చేర్చి అరెస్టు చేయించాను. కుంటిది అసలు తను సైకిలు వర్తకుణ్ణి ఎరగనే ఎరగనంది. అసిరాని విడిగా తీసికెళ్ళి ప్రశ్నిస్తే వర్తకుణ్ణి ఎరుగున్నాననీ, వర్తకునిద్వారానే కుంటిదానితో తనకి పరిచయమయిందనీ చెప్పింది. కుంటిదాని మొగుణ్ణికూడా అరెస్టుచేయించాను. వాడు పెళ్ళాంతో పోలీసు స్టేషనులోనే పోట్లాట వేసుకున్నాడు. చూచితీరాల్సిన దృశ్యం అది!

తరవాత కుంటిదాని మొగుణ్ణి ఇంకో గదిలోకి తీసుకుని వెళ్ళి కుంటిది అంతా ఒప్పుకుంది, నువుదాచి ప్రయోజనంలేదని చెప్పాను. కాని వాడు సందివ్వలేదు. భార్యని పిలిపించి 'యేంచెప్పావ్?'అని ప్రశ్నించాడు. మొగుడిచాటున నలుగురి తోనూ వ్యభిచరించే ఆ కుంటిది, "తెలివితక్కువ మొద్దా!" అని తిట్టింది. వాడు పెళ్ళాంచేత తిట్లుతినడం ఇదే మొదటి దయినట్టు నటించాడు. నిజానికి వాడికి కుంటిదంటే మొహం మొత్తింది. అదెట్లాపోయినాసరే అనే ధోరణిలో పడ్డాడు. అంతేకాదు వాడూ పెళ్ళాంచాటున అసిరాతో వ్యభిచరిస్తు న్నాడు. అసిరా ఇతరులతో వ్యభిచరించినా పట్టించుకోడు. కాని ఈతడవ, సమయాసమయాలు చూడకుండా తిట్టిందని కోపగించుకుని కుంటిదానిని అవమానపర్చాడు. అదీ ఛళ్ళున లెంపకాయకొట్టింది. ఇంకేం చేతులు కలిశాయి. నేను నవ్వాను. కాని అసిరియామాత్రం ఈ కొట్లాటను నవ్వులాటలుగా తీసుకో లేదు. గాయాలు తగిలినపుడు చూద్దాంలే అనే ఉద్దేశంతో పోలీసులు కలగజేసుకోకుండా ఊరుకున్నారు. కుంటిదాని దెబ్బలకు జడిసి అసిరా ఇద్దరినీ విడదీయాలని చూడలేదు. వాళ్ళిద్దరూ కొట్లాడుకుంటూంటే కుంటిదాని డ్రాయరులో నించి చిన్న కాగితం ముక్క జారి కిందపడింది. తీసి చదివాను. "ఇవాళ ఉదయం నాలుగువేల లీరాలకి నాకు సైకిలు అమ్మిన (కుంటిదాని పేరు రాసుంది) యివ్వడమయింది. తతిమ్మా సొమ్ము డైనమో, తట్ట తీసివేసి కొత్తవి వేసిన తరవాత యివ్వబడును." కొన్నవాని పేరు, చిరునామా రాసివుంది.

అతనినీ పోలీసులు పిలిపించారు. దొంగవస్తువని తెలియక తా నా సైకిలు కొన్నాననీ, కుంటిది, అసిగా సైకిలు ఎక్కడ దొరికేదీ చెప్పి దుకాణందాకా వచ్చి దిగబెట్టారనీ చెప్పాడు. ఈ విధంగా చెప్పి తన తప్పేమీలేదని రుజువు చేసుకోవాలని యత్నించాడు.

ఈ కథ అంతా కాగితంమీద పెట్టింతరవాత సైకిలు వర్తకుణ్ణీ, అసిరానీ, కుంటిదానినీ జైల్లో పెట్టబోయారు. ఒక పోలీసు అసిరాను ఏదో ప్రశ్న అడిగేసరికల్లా మండిపోయి వాణ్ణి 'కుక్కా! తొత్తుకొడకా!' అని దుమ్మెత్తిపోసింది. వాడికి రేచికోపం వచ్చి హఠాత్తుగా ఒక లెంపకాయ కొట్టాడు. అయిదువేళ్ళు తేలాయి. ఈ గొడవంతకీ కారణమయిన అసిరాకి కావలసిన శిక్ష జరిగింది. ఇంకా బాధపెట్టడమెందుకు? అని ఆలోచించా. దొంగతనమేమో రుజువయింది. సైకిలు దొరికింది. ఇంకా వాళ్ళని జైల్లో పడేస్తే వచ్చే లాభమేమిటి? పైగా కుంటిదానితో నేననేకసార్లు వ్యభిచరించాను. అసిరాకు ఏదో ఇంతచేతిలోపెట్టి నా చిత్రాలకి మోడలుగా ఉపయోగించుకున్నాను. ఆ విధంగా నా కామె ఉపకరించింది. కుంటిదానికి నేను బహుమతులయినా ఇవ్వలేదు. ఇక నా కోపమల్లా సైకిలు వర్తకుడి మీద. అతనూ నా సైకిలుకు పాత డైనమో, పాత తట్టా తీసేసి కొత్తవి ఏర్పర్చాడు. వాటిని నా సైకిలుకు బిగించకపోయినా పోలీసుస్టేషనుకి తీసుకు వచ్చి నా దయ సంపాదించడానికి నాకిచ్చివేశాడు. ఈ విధంగా దొంగల దగ్గరనించి నాకేదో ఒకటి ముట్టింది.

పేటన్నిటినీ మించి నాకవితాహృదయం వాళ్లని జైలుకు పంపవద్దని ఘోషించింది. నేను హాస్యప్రియుణ్ణి! ఈ భూలోకం మానవుని అనంతజీవితయాత్రలో ఒక మజిలీ అని నా దృఢ విశ్వాసం. మనం ఏలోకంలోనుంచో కెవ్వుకెవ్వుమని ఏడిస్తూ ఈలోకంలోకి వచ్చి పడుతున్నాం. మళ్ళీ ఏ లోకానికి పోతామో మనకే తెలియదు. ఈ లోకంలో మనం ఆడే నాటకంలో మనకి విసిగెత్తిపోతుంది. ఈముక్క చిన్న పిల్లవాడితో చెప్పి చూడండి! వాడి జీవితం ఉరికంభంమీద అంతమవుతుందనో, మోసగత్తెను వివాహ మాడతాననో వాడికి జోస్యం చెప్పండి! ఊం-చెప్పండి! వాడు మంత్రి అయి, ప్రజాదరణ కోలుపోయి కుక్కచావు చస్తాడని చెప్పండి! ఏమవుతుందో!

ఈ భూలోక జీవితంలో సుఖదుఃఖాలు రెండూ అనుభవించాలనీ, కష్టాలను, దుఃఖాలను జయించాలనీ తెలిస్తే ఎవ్వడూ ఈ భూమ్మీద పుట్టడానికి ఇచ్ఛగించడు. అసలు కష్టాలను, దుఃఖాలను జయించడం ఎందుకు? కష్టపడ్డవాడు ఎక్కువకాలం జీవిస్తాడా? లేదే. ఇక మిగిలిందల్లా ఉపశమనం ఒక్కటే.

నేను పెద్దవాణ్ణయిపోయాను. ఆత్మపరీక్ష నాకిప్పుడు సరిపడదు. యుద్ధం ముగిసింతరవాత విశ్రాంతి తీసుకునే సేనానాయకులు చేసేపనే నేనిపుడు చేస్తున్నాను. నా అనుభవాలు, జ్ఞాపకాలు పుస్తకంగా రాస్తున్నాను. నేను ప్రస్తుత రాజకీయ పరిస్థితినిగురించికూడా రాస్తున్నానుగాని అది చాలా బాధాకర

మయినది. సమకాలికుల అభిప్రాయాలనుమార్చడం రచయితకి మహాకష్టం. మనం వట్టి తోలుబొమ్మలమయిపోయాం. కథలు రాసుకోవడం కోసరం జీవితాన్ని బూడిదపాలు చేసుకున్నాం. కాని ఒకప్పుడు నేను బాగా బతికాను! నేను నగరాలలో నివసించే లక్షలాది జనులు వెరిచే అరాచకపు జీవితం అనుభవించాను. ఎవరికీ తలొగ్గలేదు. గత్యంతరం లేక పారిపోయ్యాను. అడవులే నాకు శరణ్యాలయినాయి. అక్కడ నిజమయిన శాంతి లభించింది. గాలిలో కదలాడే మొక్కలను చూస్తూ ఆనందంగా కాలం గడిపాను.

వీటిని చూస్తూ గంటలకి గంటలు, రోజులకి రోజులు, వసంతకాలం గడపవచ్చు. మధ్యమధ్య ఆడతుమ్మెదో సీతాకోకచిలుకో, మగతుమ్మెదో వచ్చి మొక్కలమీద వాల్తాయి. ఆడతుమ్మెదపేరు అసిరా. అన్నాస్టిక్లర్ సీతాకోకచిలుక. నేను మగతుమ్మెదను!

పాపం! కుంటిదానిని చూసేసరికి నాకు జాలేసింది. దానికి ఇద్దరు పిల్లలు. పెద్దది తనతల్లి దొంగనీ, ఏనాడయినా జైలుకు వెళుతుందని అనుకొనే ఈమది. రెండోది పసిపాప. తల్లికోసరం ఎంత ఏడుస్తోందో!

తీర్పు చెప్పేముందు ఈ విషయాలన్నిటినీ జడ్జీలు ఆలోచించరేం! ఎందుకు ఉదాసీనం వహిస్తారు? నిజానికి కోర్టులు సమస్యల్ని పరిష్కరించలేవు. మానవ సమస్యలు మానవత్వంతో ప్రకృతిలోలాగానే పరిష్కారం కావాలి. ప్రకృతి! ప్రకృతి మనమాత, ఉపాధ్యాయిని! ఆమెలోని తప్పి

దాలను మనం గ్రహించినా నిందించం. ప్రకృతి మనలను దండిస్తుంది. కాని మనలను ద్వేషించదు. జడ్జీల మాదిరిగా ఉదాసీనంగా ఊరుకోదు. మరి శిక్షించడం దేనికి? మనలని బాగుచెయ్యడానికి. తాగుబోతుని చూడండి. సకాలంలో తాగుడు మానకపోతే ప్రకృతే వాణ్ణి శిక్షిస్తుంది. ప్రకృతి క్రూరురాలే, కాని జడ్జీ లంత క్రూరురాలు కాదు. ఈ జడ్జీలు మానవుల తలలు కొట్టేయిస్తారు, కాల్పిస్తారు. జైలులో పెట్టి నరకయాతనలు అనుభవింపజేస్తారు. కాని తాము, విధించే శిక్షవల్ల నేరస్తుడు బాగుపడతాడా లేదా అని ఆలోచించరు. పశ్చాత్తాపపడ్డాడని కరుణించరు! వారికి కావలసిందల్లా అక్షరాలా లా అమలుపర్చడం ఒక్కటే! ఇక లా ఎలాంటిది? నిర్బంధానికి మారు పేరే లా! అంతేకాదు ఒకడు తప్పిదం చేసిన అందరినీ చుట్టుకుంటుంది. కుంటిదాని మొగుడు నూనెదొంగగా తయారుకాకముందు ఇళ్ళకి రంగులువేస్తుండేవాడు. డబ్బు సంపాదించేవాడు. దొంగతనం చేయవలసిన అగత్యంఉండేదికాదు. వాడిఒక్కడి మూలంగా కేసు నలుగురికి చుట్టుకుంది. అసలు దొంగ కానిదెవరు? నేను ప్రకృతి నించి ఎదో కొంత దొంగిలించలేదూ? అసిరానించి ప్రేమనే గాక రోజూ గంటలతరబడి మోడలుగా ఉపయోగించి ఆమె కాలాన్ని దొంగిలించలేమా?

అందరూ అమాయకులు, నేనొకడనే అపరాధిని అనే పిచ్చినమ్మకంలో పడిపోయేవాడినే. నా సంగతి నాకు బాగా

తెలుసు. పవిత్రతలోని గుట్టుమట్టులు తెలుసు. ఋషి అంటూ ఎవడూ లేడు. పుట్టుకతో ఎవడూ ఋషికాడు. కామిగాక ఎవడూ మోక్షగామి గాడు. నేనూ కామినే! నా మాట నమ్మండి.

ఇటువంటి నిర్ణయాలకువచ్చి హృదయ భారం తీర్చు కుందామనుకున్నాను. దొంగల విషయంలో ఇంత కఠిన చర్యలు తీసుకున్న నేనే వారిని విడిపించడం హాస్యాస్పదంగానే ఉంటుంది. అయినా ప్రయత్నించి నెగ్గాను.

పోలీసులు నన్ను వెర్రివెంగళప్పకింద జమ కట్టేస్తారనే నా గట్టినమ్మకం. కాని వాళ్ళూ భగవంతుని బిడ్డలేగా! వారిలో ఒకడు ముద్దాయిలు నలుగురినీ వదిలేస్తారని తెలియ గానే తనకు కాపలాబాధ తప్పిందనే సంతోషంతో చేతులు నలుపుకుంటూ నాకేసి అర్ధవంతంగా చూసి చిరునవ్వు నవ్వాడు. కాని ఇనస్పెక్టరుమాత్రం నాకు మతిపోయిందనే భావించాడు.

నాకు నిజంగా మతి పోయిందా? అలా అనకండి. మీకంటె తెలివిగలవాడననే నా భ్రమను తొలగించకండి. నన్ను నేను మోసగించుకోనీయకండి. నా కవితాత్మను మోసగించనీయకండి. నా ఆలోచనా పరంపరను అనుస రించాలని యత్నించండి. అలా అనుసరించినకొద్దీ ప్రభుత్వాలు దుర్బలమయి పోతాయి. సన్నగిలి పోతాయి. కీసేడలయి పోతాయి. అవును. ప్రభుత్వాలు, పోలీసులు కీసేడలలాగానే ప్రవర్తించాలి. ఈ భూమిమీద పడడానికీ, ఈ భూమినించి

నిష్క్రమించడానికీ మధ్యగల వంతెనమీద యాత్రీకులకు దారిచూపే దీపపునీడల్లాగా ఉండాలి. కీనీడలు ! కీనీడలు ! బలహీనులను, అలసిపోయినవారిని ఓదార్చే కీనీడలుగా గాకపోతే, ప్రభుత్వాలు వారిని దయతో చూసి, హరిజనులకు ఆశ్రయమిచ్చి, రోగులకు చికిత్స చేయించి, నిస్సహాయులను రక్షించి, నిరక్షరాస్యులను అక్షరాస్యులను చేసి, ప్రజాపీడకు లను అదుపులో పెట్టి పుణ్యం కట్టుకోమనండి. ఈ అడవిమృగా లను అదుపులో పెట్టడానికి వాటిపొట్టమీద కొట్టడంకాదు, బాగా పనిచేసే బ్రేకులువేసి ఆపడమే ఉత్తమమార్గం.మిఠాయిల మీదవాలే ఈగలంత తేలిగ్గా ఉండాలి ప్రభుత్వాలు. ఇప్పటి మాదిరిగా పాముల్లాగా, కందిరీగల్లాగా మాత్రం ప్రభుత్వాలు ఉండకూడదు.

ఇక మొన్న పోయిన సైకిలుసంగతికి వద్దాం. ఈ నా అల్యూమినం సైకిలుని ముద్దుముద్దుగా 'వెండిసైకిలు'అను కుంటూ మురిసిపోయేవాడిని. అలాంటి సైకిలు పోతేపోయిం దని నోరుమూసుకు ఊరుకోవడమా, ఏమయినా సరేనని ఆఖరిసారిగా ప్రయత్నించడమా? ఈ సందిగ్ధావస్థలో పడి కొట్టుకుంటున్నాను. 'సైకిలుపోతే యింకోడిసైకిలు కొట్టెస్తే సరిపోతుంది' అన్నాడొక మంగలి వేళాకోళంగా. సాధార ణంగా రోమ్‌నగరవాసులంతా భాగ్యవంతులు,జత్తులమారులు. సైకిలుపోతే ఇంకోడి సైకిలు కొట్టేస్తూంటారు. ఏ వీధిమలుపు లోనో ధైర్యంగా నిల్చుని ఎవడో నాలాంటివాడే సైకిలు బయట పెట్టి ఏదుకాణంలోకో వెళ్ళడం చూసి వాడి సైకిలు వేసుకుని

తుర్రుమనాలి. మహా అయితే పదిగజాలదాకా నా వెంట పడ తారేమో. అంతే. ఈ మహానగరంలో నన్నెవరూ గుర్తు పట్టలేరు. కాని యాభైపళ్ళు వచ్చి, ఇప్పటివరకూ పెద్దమనిషినీ కవినీ అనిపించుకుని ఇప్పుడు దొంగతనానికి దిగడమా! ఉహుం— అయితే వేరే మార్గమేముంది? పోయిన వస్తువును పట్టుకోడానికి యత్నించడం సరదాగా ఉంటుంది. అందుకని బాగా ఆలో చించాను; ఆలోచించాను. దొంగదగ్గిరికి వెళ్ళి మంచిమాట లతో మర్యాదగా నా సైకిలు నాకిచ్చివేయమని అడుగుదా మనుకున్నాను. మంచీ మర్యాదా దొంగలకెందుకు? వస్తువు లను దాచుకుందామని దొంగఎవరూ దొంగిలించరు. అమ్మి సొమ్ము చేసుకుందామని దొంగిలిస్తారు. దొంగతనంకోసరం దొంగతనం చేస్తారు. వాళ్ళదృష్టిలో అదొక వ్యాపారం. లాభసాటిబేరం!

అంటే నేను పాపాను సమీపించి సమర్యాదగా మాట్లాడాలి. ఎలా? ఎప్పుడు? నేనంటే వాడికి గిట్టదు. వాడంటే నాకు గిట్టదు. పానికోరోడ్డుమీద జరిగిన గలాభా తీవ్రమయింది కాకపోయినా కలహాంకింద పరిణమించింది. వీధివెంట వెళ్ళడమే ప్రమాద మనిపిస్తోంది.

ఇంతలో ఫ్లోరెండా అనే అమ్మాయి నాకు జ్ఞాపకం వచ్చింది. ఆమె ఒక కటికివాని కూతురు. పల్లెటూరి జీవితంతో విసిగెత్తి బస్తీ చేరింది. ఆమె మహాకాముకురాలు! తాగుబోతు!

ఫ్లోరిండా రోమ్‌నగరం చేరుకుని అడిస్ అబాబానించి అప్పుడే తిరిగివచ్చిన ఒకావిడకు దాసీగా కుదిరింది. అడిస్ అబాబాలో ఆ యజమానురాలి భర్త కోర్టుజవానుగా పనిచేసి నానాగడ్డి తిని డబ్బు గడించాడు. అతనిభార్య అనేక ఆభరణాలతో రోమ్‌నగరంలో దిగింది. వాళ్ళ ఇంటిలో కొన్ని నెలల పాటు ఫ్లోరిండా హాయిగా కాలం గడిపింది. యజమాని ఆమె విటుడయ్యాడు. అతనిభార్య ఈ సంగతి తనకేం తెలియనట్లు నటిస్తూ జర్మన్ రాయబార కార్యాలయంలోని ఒక ఆఫీసరుతో కామకలాపం ప్రారంభించింది. భార్యాభర్తలు కూడబెట్టింది చాలాభాగం ఖర్చు అయిపోంతర్వాత ఆ ఆఫీసరు జర్మనీలోని రాజకీయ శిక్షణాశిబిరంలో చేరమని అతనికి సలహా ఇచ్చాడు. ఆ సలహాప్రకారం అతను భార్యను రోమ్‌లో వదిలిపెట్టి జర్మనీ చక్కాబోయాడు.

అతను వెళ్ళిపోయింతరవాత అతని ఇంటిని బోగం కొంపగా ఆ ఆఫీసరు మార్చేశాడు. ఆ ఇంటి యజమానురాలు తార్పుడుగత్తెగా తయారయింది. బహుశా ఈ విధంగానే ఆఫ్రికాలో డబ్బు బాగా గడించి ఉంటుంది. ట్యూరిన్‌నించి చెల్లెలిని పిలిపించి. ఫ్లోరిండా ఉండనేఉంది. ఇంకేం? ఫ్లోరిండా మేరియా ఆంటోనిటా అనే అమ్మాయినికూడా ఈ ఊబిలోకి దించింది. ఈ మే రియాద్వారానే నాకు ఫ్లోరిండా పరిచయమయింది.

మేరియా నాకు మోడలుగా వచ్చి కూర్చుంటూండేది. ఫ్లోరిండా ఆమెను మాయజేసి తనతో ఉండమనిచెప్పి ఆ బోగం

కొంపకు తీసుకుపోయింది. ఇక అక్కడ-ఆ భోగం కొంపలో నలుగురు ఆడవాళ్ళు చేరారు. మూడు కొప్పులే కలవవాయెను! ఒకరిని చూసి ఒకరికి చుప్పనాత్తనం పుట్టింది. పోట్లాడుకుని ఫ్లోరిండా, మేరియాలను ఆ ఇంటినించి బయటికి నెట్టేసారు. మేరియా చాలా అందమయింది. మొహం కొంచెం తోడేలు మొహంలాగా ఉన్నా ముద్దొస్తోఉంటుంది. సున్నితమయిన రేఖలు, వంపు తిరిగిన ముక్కు, చిన్న నోరు, చిన్నగడ్డం, చక్కటి కళ్ళు, విచిత్రమయిన రంగుజుట్టు. నేనామెను బాగా వర్ణించలేకపోతున్నాను. ఆమె అందం వర్ణించడానికి మాటలు చాలవు!

ఆ భోగంకొంపలోంచి బయటికి తరిమివేయగానే ఫ్లోరిండా, మేరియాలు గత్యంతరంలేక వీధులవెంటపడ్డారు. కాని ఎవడికిపడితే వాడికి శరీరం అప్పగించలేదు. మనసుకెక్కిన వారితోనే చెలిమిచేశారు. నావికులంటే వాళ్ళకి మోజు ఎక్కువ. ఎదురు డబ్బుకూడా ఒకప్పుడు ఇస్తూండేవారు. నావికులతోకలిసి వీళ్ళిద్దరూ ప్రతిరోజూ సినిమాలకి వెళుతూ తామే డబ్బు ఖర్చుపెట్టేవాళ్ళు.

మేరియా, ఫ్లోరిండాలు అప్పుడప్పుడు నా స్టూడియోకి వస్తూ ఉండేవాళ్ళు. నేను రమ్మని పిలవకుండానే సరదా పుట్టి నప్పుడో, ఏమీ తోచనప్పుడో, చేతిలో డబ్బు లేనప్పుడో వచ్చి ఏ రెండు గంటలో నాకు మోడలుగా పనిచేసి మస్తుగాతిని, అలసట తీర్చుకుని మళ్ళీ వెళ్ళిపోయేవాళ్ళు.

చివరికి మేరియా ఒక యస్. యస్. ట్రూపరు మీద వ్యామోహంకొద్దీ జర్మనీలో పనిచెయ్యడానికి వెళ్ళిపోయింది. నేను ఎంత వద్దన్నా వినలేదు. మెకానిక్కుగా ఆమె చేరిందని విన్నాను.ఇక ఫ్లోరిండా జర్మనీవాళ్ళతో కొంతకాలం కాలక్షేపం చేసింది. తరవాత తరవాత వ్యభిచారం చేయడం మహా ఘోర మని అనుభవంమీద గ్రహించింది. అందుకే వృత్తిలో ఆమెకి ఉదాసీనత ఏర్పడింది. మోహం నశించిపోయింది. పచ్చి బోగందానిలాగా తయారయింది.

ప్రస్తుతం పానికోరోడ్డు సమీపంలో ఒక చిన్నగది అద్దెకు తీసుకుని అమెరికన్లతో వృత్తిసాగిస్తోంది. ఆ గదిలో రాణీలాగా బతుకుతూంది. ఎంతలేదన్నా వారానికి డభై వేల లీరాలు సంపాదిస్తుంది. రోజుకు తిండికింద వెయ్యి లీరాలు, చెప్పులకూ, మేజోళ్ళకీ వేయిలీరాలు ఖర్చుచేస్తుంది. ఆమెరికన్ సైనికులు ఆమెకి బంగారు పూతపూసిన ఉంగరాలు, మంచిమంచి అత్తర్లు కొని ఇస్తూంటారు. వాటిని తీసుకుని మెదలకుండా ఏ పెట్టెలోనో దాచేస్తుటుంది. పగలల్లా నిద్ర పోతుంది. మొహంలో కళాకాంతులు మాయమయాయి. లావెక్కిపోయింది. అహంకారం ఎక్కువయింది. యదార్థానికి పందికొక్కులా తయారయింది.

ప్రస్తుత పరిస్థితిలో ఫ్లోరిండాని కలుసుకోవడంకంటే వేరే మార్గం గోచరించలేదు. లిండా (నాతో ఫ్లోరిండా తన పేరు లిండా అని చెప్పింది. ఇకనించీ ఈ పేరే ఉపయోగిస్తాను) వృత్తిసాగించేందుకు తీసుకున్న ఇంటిదగ్గిర చౌరస్తా ఎదుగు

న్నాను. ఆ వృత్తి చెయ్యడం లిండాకి బాధాకరంగానే ఉంది. కాని అంతకంటే చెయ్యడానికి వేరే పనేముంది? లిండాని ఒక యువతి కొరల్లో రోడ్డుకు తీసుకుపోయింది. ఆ యువతి కూడా వృత్తిలో ఉన్నదే. అయితే మిత్రరాజ్యాలవారు భోగం కొంపలను మూసివేయించిన తరవాత ఆమె వచ్చి లిండాతో ఉంటోంది. మిత్రరాజ్య సైనికులు ఈ ఇంటికి ఎక్కువగా వచ్చి కామదాహం తీర్చుకుంటారు.

వారి రాకపోకలనుబట్టి లిండా ఇంటిని గుర్తించాను. అనవసరంగా మేడ ఎక్కడం ఎందుకనుకుని కిందిభాగం తలుపు కొట్టాను. ఒక యువకుడు వచ్చి తలుపు తీశాడు. అతను మాంచి బలశాలి. అచ్చంగా తిరుగుబోతులాగా దొంగలాగా హంతకుడిలా ఉన్నాడు.

“లిండా అనే ఆవిడని యెరుగున్నావా?” అని ప్రశ్నించాను. అతను నాకేసి తేరిపారజూచాడు. అపాయకరమయిన ప్రదేశాలకు వెళ్ళినపుడు నేను ప్రదర్శించే అమాయకత్వం అతనిని ఆకర్షించింది.నన్నతను ఏబజారులోనో తిరుగుతూండగా చూచాడేమో నాకు తెలియదు. కాని నన్ను చూచీచూడడంతోనే నేనెవరినో గ్రహించాడు. బహుశా నా విషయం లిండా ఉన్నవీ లేనివి కల్పించి చెప్పిఉండచ్చు. నేను చిత్రకారుణ్ణనీ, కవిననీ చెప్పిందేమో. తామెంత పతనమయినదీ గ్రహించలేని వ్యభిచారిణులు, ‘నువ్వు భోగంలంజవి’ అని మొహంమీద అంటే ఆశ్చర్యపొయ్యేవాళ్ళు, సామాన్యంగా

అంతకుముందు గౌరవంగా తాముచేసిన పనులని, యజమానులను మరిచేవారు.

ప్రభుత్వం పొరపాటున నా చిరునామాకు పంపిన కొన్ని కాగితాలు, శేషను పుస్తకాలు లిండాకి ఇవ్వడానికి వచ్చానని చెప్పాను. ఈ మాటలు విన్న తరవాత అతను శాంత పడి నాతో స్నేహితుడిలాగా నవ్వుతూమాట్లాడ సాగాడు. ఇంతలో ఒక యువతి అతని వెనక ప్రత్యక్షమయింది. లోపల ఏంజరుగుతుందో గ్రహించాను. నే నామె గదికి వెళ్ళకపోయే సరికి మొహం ముడుచుకుని మొదటి అంతస్తులోకి వెళ్ళి పోయింది. నేను గంట నొక్కుదామనుకుంటూ౦టే తలుపులు తెరచుకున్నాయి. ఇద్దరు యువతులు ఒక నీగ్రోని బయటికి నెట్టేశారు. ఆ ఇద్దరు యువతులలో ఒకతీ లిండా కాదు. నేను రెండు అంతస్తులు దాటి మూడో అంతస్తు చేరుకున్నాను. అక్కడ ఒకతె చేతులు నలుపుకుంటూ ఎవరికోసం వెతుకుతున్నావని నన్ను ప్రశ్నించింది.

“లిండా యిదివరలో నా దగ్గిర పనిచేసేది.” అన్నాను బిగ్గరగా. బిగ్గరగా చెబితే లిండాకి వినిపించి వస్తుందేమోనని నా ఆశ. కాని లిండా ఇంట్లో లేదు. పానికోరోడ్డు చివరనున్న హోటలుకు వెళ్ళి ఉంటుందని ఆమె చెప్పింది. ఇంక తెలుసుకోవలసిందేముంది? మెట్లు దిగుతున్నాను. ఇంతలో ఆమె నన్ను ఆపింది. ఏదో అనుమానం తగిలినట్లుంది. సరే పాతవిషయాలు ఇంకా వివరంగా మాట్లాడుకున్నాం. గంటకీ రెండు గంటలకీ తాను గదులు అద్దెకివ్వడంలేదనీ లిండాకీ తనకీగల మైత్రిని

పురస్కరించుకుని, వీధులలో పడకుండా కాపాడేందుకే లిండాకి గది ఇచ్చానని చెప్పి నను నమ్మించాలని చూసింది.

లిండాఖర్చు మనిషట. శుభ్రంగా ఉండదట. మూడు వందల లీరాల దువ్వెన మూడు రోజులలో పోగొట్టుకుంది. ఇంకో దువ్వెన విరగకొట్టేసింది. లిండా పగలల్లా నిద్రపోతుంది. సాధారణంగా వ్యభిచారిణులు రాత్రంతా మేలుకొని పగలల్లా నిద్రపోతారు. ఆ అలవాటే లిండాకీ అబ్బింది. ఇంతేకాదు. స్వాభావికంగానే సోమరి. నిద్రమత్తుమనిషి. ఆమెకి పక్క ఒక్కటే ఇష్టమయిన వస్తువు. పగలు ఒంటరిగా పడుకోగోరుతుంది. రాత్రిళ్ళు ఒంటరితనం భరించలేదు. ఇదీ లిండాని గురించి ఆమె ప్రకటించిన అభిప్రాయం.

ఆమూకి తెలిసిందిగా, తిన్నగా వెళ్ళి ఆ హోటల్లో లిండాను కలుసుకున్నాను. ఒమె ఒంటరిగా లేదు. వెంట పదెనిమిది మంది దొంగలు, ఒక యువతి ఉన్నారు. ఆయువతి పదహారోఏటనే పెళ్ళి చేసుకుంది. ఒక పిల్లవాడు. పిల్లవాడిని అనాథశరణాలయంలో ఇచ్చి వృత్తికి దిగింది. ఇదంతా నాకేం తెలుసు? నువు చాలా అందమయిందానివి, మోడలుగా మంచి పేరులోకి వస్తావు అని పొగిడేసరికి తనకథంతా చెప్పింది.

ఇక లిండా: నన్ను చూడగానే కంగారుపడినట్టుంది. చాలా కాలమయిన తరవాత ఈ స్థితిలో నాకంట పడినందుకు

సిగ్గుపడింది. మూడు కప్పుల నీళ్ళకాఫీ తెచ్చిపెట్టినందుకు బహుమానంగా పది లీరాలు మట్టుకే వెయిటరికి ఇచ్చానని మండిపడింది.

ఆమె వెన్నరాసిన రొట్టె కొంచెం కొంచెం తిన నారంభించింది. వాటిబిల్లు నేనిచ్చుకోనని ఖండితంగా చెప్పే శాను. దానిమీద తనకు డబ్బు కేకొదవలేదని చెపుతానికో లేక కావేషంకొద్దో రెండు చేతుల్తోనూ తీసుకుని ఓ డజను రొట్టెలు తినేసింది. బిల్లు చెల్లించేటపుడు పర్సు తీసి రెండు వందల లీరాల నోట్లు ఇచ్చింది. పర్సుకేసి చూద్దునుగదా దాంట్లో నోట్లు బొత్తులు బొత్తులుగా ఉన్నాయి. నేనేం చెయ్యాలి? ఒకప్పుడు మా ఇంట్లో దాసీపనిచేసి ఇపుడు రాణీగా తయారయిన ఈమెను అభినందించాలా? అభినందించడంలో అర్థమూలేదు, నేనందుకోసరం రానూలేదు. హోటల్లో పాపా కాసీ వాడి ముతా గానీ కనిపించలేదు. నా సైకిలు వెదికి తెచ్చేవిషయం లిండాకు అప్పగించడం మంచిదని నాకు నమ్మకం ఏర్పడింది.

మర్యాదగా ప్రవర్తించి లిండా మనసు కరిగేటట్లు చెయ్యాలి. లిండా లాంటిస్త్రీలు వట్టి చెత్తాకానీవాళ్ళు. మా అమ్మ, అమ్మమ్మ, మాచెల్లెలు మేరియా, నాభార్య అనిటా తప్పితే తక్కినవాళ్ళల్లో చాలా భాగం వట్టి చుప్పనాతివాళ్లు. పురుషుని ఎన్నివిధాల తినెయ్యాలో అన్నివిధాలా తినేస్తారు. ఇకేమీ మిగలనపుడు తోసిపారేస్తారు. అయినా నేను ఎలాగో

ఆమె మనసు కరిగించాలి. కాని లిండాలో స్త్రీత్వం నశించింది. పచ్చి బోగందానిలా తయారయింది. ఇటువంటివాళ్ళు ఇతర్లని తేలిగ్గా అవమాన పరుస్తాను. నిమిషాలు లెక్కపెట్టుకుంటారు. గిట్టుబాటు కానపుడు మాట్లాడుతూ కాలం వృధాపుచ్చడం వీళ్ళకి గిట్టదు. వీళ్ళకి రోజూ ఎంతో కొంత ఆర్జించకపోతే గడవదు. అందుచేత వీళ్ళకి నీచుల్తో సావాసం తప్పనిసరి అవుతోంది.

లిండాకి నేనెన్నడూ అపకారం చెయ్యలేదు. లాలించేవాడిని. తమాషాకి ఏడిపించేవాడిని. అంతే. లాలింపు మర్చేపోవచ్చు. కాని తమషాకి ఏడిపించాననే కోపం మాత్రంపోదు. నేనంటే ఆమెకా అభిమానం లేదు. పైగా నాకు ఆమంటే అసహ్యం. అయినా అవసరంకొద్దీ ఆమెతో చల్లగా మాట్లాడుతూ నాపని మూడుపువ్వులు ఆరు కాయలుగా ఉందనీ, నా చిత్రం ఒకటి అమ్మి ఆ డబ్బుతో ఆమెకోసరం బంగారపు ఉంగరం కొన్నాననీ చెప్పాను. నిజానికి నేనుచిత్రం అమ్మనూ లేదు, పెట్టనూ లేదు. అవసరంకొద్దీ అబద్ధం ఆడేశాను.

"ఓ - అలానా ! యెంతకి కొన్నావ్ ? యేదీ చూడనీ! నా కిచ్చెయ్యకూడదూ ? వేలినించి తియ్యి చూదాం ?"

కాని నేను వేలినించి ఉంగరం తియ్యలేదు. తీసి చూపించానా గుట్టుకాస్తా బయట పడుతుంది. నా ఉంగరం సిసలయిన బంగారానిది కాదు. అందుకని దూరాన్నుంచే చూపాను.

"చూడు, యెంత అందంగా వుందో! మాంచి చిత్రం ఒక అమెరికావాడికి అమ్మి దాంతో యిదికొన్నాను."

"ఓ - నువ్వూ అమెరికావాళ్ళతో వ్యాపారం మొదలెట్టావన్నమాట!"

"ఆఁ నేనూ అమ్ముకుంటున్నాను." అన్నాను వేళాకోళంగా. "నీ వేలికీ వుంగరం వున్నట్టుందే! యేదీ చూడనీ!"

"నావుంగరమా? చాలా విలువయింది. గొంతుదాకా తాగిన వక కెనడావాడు రాత్రి నాకిచ్చాడు."

"పందెం. అదీ నికారసుసరుకు కాదు."

"నికారసయింది కాదూ?" అని మండిపడుతూ చెయ్యి జాడించి, మళ్ళా వెనక్కి తీసుకుని రెండోచేతితో ఉంగరాన్ని మూసేసింది. ఆమెకి చెడ్డకోపంవస్తే కళ్ళు వజ్రాల్లాగా తళతళా మెరిసిపోతాయి. అలా మెరిసినకళ్ళతో ఆ ఉంగరంకేసి తేరి పారజూచింది. కనడావాడు తనను మోసగించాడనే అనుమానం ఆమెని బాధింపజొచ్చింది.

"నన్ను మోసగించాడంటావా? తప్పతాగున్నాడు మరి!"

ఆ కనడావాడు వట్టి టక్కరివెధవ. తప్పతాగినట్టునటించి, లిండాకు డబ్బుకు బదులు ఈ దండగమారి ఉంగరం అంటకట్టి చక్కా పోయ్యాడు. బరువునుబట్టి, రాయి లక్షణాలనుబట్టి ఆ ఉంగరం మంచిదో కాదో తెలుసుకోవచ్చు. దాని రాయి సునిమానురాయి. సునిమానురాయి రంగు నాలుగుబొట్లు విస్కీ కలిపిన నీటిరంగులా ఉంటుంది. ఈ ఉంగరంలోని రాతి

రంగు అలా లేదు. అంతేకాదు, బంగారాన్ని దేనిమీదన్నా రాసి చూసితే మంచి బంగారం అయిందీకానిదీ తేలిపోతుంది. ఈ వాదనంతా ఆమెకి నచ్చింది. సామాన్యంగా లిండాలాంటి వ్యభిచారిణిలు సొమ్ములంటే పడిచస్తారు. బంగారం మంచిదా కాదా అని చూడరు.

"అవును. మంచి బంగారం కాకపోవచ్చు నువ్వు వచ్చి యిలాగే నా మనసు పాడుచేస్తుంటావ్! నువ్వు వట్టి రాక్షసు డివి! యిక్కడికెందుకు వచ్చావ్? నాకు అనుమానం ఎందుకు రేకెత్తించావు? కిందటి రాత్రి నాకో కనడావాడు, కాదు సిసిలీవాడు...ఉహూఁ యిద్దరూ వచ్చారు. యిద్దర్లో యెవరి దగ్గిరగుంజు కున్నానో గ్యాపకం లేదు."

"సరే చూద్దాం. వుంగరంతియ్యి. గోడకేసి గీరిచూస్తే అన్ని అనుమానాలు తీరిపోతాయిగా" అన్నాను.

విలువయినరాళ్ళ లక్షణాలమీదా, మంచి బంగారం మీదా ఉపన్యాసం ఆపకుండా దంచేవాణ్ణేగాని తన స్నేహితు రాలిముందు ఈ గోడవేమీ తీసుకురావద్దని లిండా నన్ను వారించింది. "హోటలు బయటికివెళ్ళి పరీక్షచేదాం," అని నా చెవిలో చెప్పింది.

ఆమెతో ఒంటరిగా మాట్లాడడమే నాక్కావలసిందల్లా. ఒక క్షణం ఆగమని స్నేహితురాలితో చెప్పి బయటికివచ్చింది లిండా. బయటికి రాగానే, "దొంగని కలుసుకునే యేర్పాటు చెయ్యి, చేస్తే డబ్బిచ్చే నా సైకిలు నేను కొనుక్కుంటాను.

యీూ హోటలుకి తరుచుగా వచ్చే నీ సహచరులే నా సైకిలు కొట్టేశారు." అని చెప్పాను. ఈ మాటలు చెప్పడానికి నాకెంతో సిగ్గేసింది. నేను జిత్తులమారివాడినని ఇంతవరకూ ఆమె నమ్ముతూండేది. తనకంటె ఎక్కువ జిత్తులమారివాడననీ, అనవసరంగా చిక్కులు తెచ్చిపెట్టుకోవడం ఎందుకని పైకి అమాయకుడిలా ప్రవర్తిస్తాననీ ఆమె నమ్మకం. ఎప్పుడయితే నేను సైకిలు పోగొట్టుకున్నానని తెలిసిందో అప్పటినించీ ఆమె వైఖరి మార్చుకుని నన్ను వెర్రిబాగులవాడికింద జమకట్టేసింది. ఇంతమాత్రానికే భయపడిపోకుండా, ఆమె నను వదిలిపెట్టి వెళ్ళిపోయింతరవాత నా భార్యకి ఇంటిచాకిరితో బొత్తిగా తీరుబడి లేకుండా ఉందనీ, నేనే స్వయంగా వెళ్ళి ఇంత పులుసు అడిగి తెచ్చుకుంటున్నాననీ చెప్పాను.

"యేవిటా? పులుసుకోసరం వాళ్ళనీ వీళ్ళనీ దేబరిస్తున్నావా? నీ పని మూడు పువ్వులు ఆరు కాయలుగా వుందని యిపుడేగా చెప్పావ్." అంది లిండా.

"నాపని నానాటికీ తీసికట్టుగా వుందని నీస్నేహితురాలి ముందు యెలా చెప్పేదీ?"

"ఓ-అదా! అయితే నన్నేం చెయ్యమంటావో చెప్పు."

ఈవిధంగా మాట్లాడితే స్త్రీలు చాలా ఉదారంగా ప్రవర్తిస్తారు. సామాన్యంగా ప్రజలతో, ముఖ్యంగా విటులతో అసహ్యంగా ప్రవర్తించే వీళ్ళు పూర్వపు యజమానికో, నచ్చిన మనిషికో ఉపకారం చెయ్యవలసి వచ్చినపుడు ఎంతో

దయ కురిపిస్తారు. ఉదారబుద్ధిని చాటించుకోడానికి తమదగ్గిర ఉన్న దాంటో సగానికిసగం ఇచ్చేస్తారు. లేకపోతే అదృష్ట హీనులకి సహాయం చెయ్యాలనే బుద్ధితో ఇస్తారు.

ఒకప్పుడు నాకు ఉపకారం చేసినవాళ్ళల్లో మేరియానీ అనే అమ్మాయిని ఇప్పటికీ నేను మరిచిపోలేదు. నాస్థితి బాగుండని రోజుల్లో రోజూ రొట్టెలు తెచ్చిస్తూండేది. జర్మనీ వాళ్ళతో కలసి తిరిగేది. తిరిగి వచ్చేటప్పుడు తప్పకుండా ఇన్నిరొట్టెలు తెచ్చేది. కాని ఒకటీతను తినేదికాదు, అందు చేత వ్యభిచారిణులను గురించి చెడుగా మాట్లాడేముందు, బాగా ఆలోచించి మాట్లాడడం మంచిది. వాళ్ళు భగవంతుని బిడ్డలేగా! మేరియానీ అంతటి మంచిదాన్ని నేనెక్కడా చూడ లేదు. ఇప్పుడు లిండా కూడా నామీద చాలా దయ చూపిం చింది. నా సైకిలు సంగతి చెప్పాను నవ్వి అన్నది:

"ఊఁ మంచి తెలివిగలవాడవిగదూ? చిన్నచిన్న విష యాలకే నన్ను ఆక్షేపించేవాడవి. నన్ను గురించి చెడుగా మాట్లాడే వాడివిగదూ? అయినా నావల్ల అయ్యేపనులూ కొన్ని ఉంటాయి. నేను మంచి చెయ్యగలను."

ఆలోచించడానికికని ఆగింది. నేను ఊరుకోకుండా, "యేం చెయ్యమంటావో చెప్పు. నువుచెప్పినట్లుచేస్తా"అన్నాను.

"ఒక్క నిమిషం ఆగు. నా స్నేహితురాలితో సంప్ర దిస్తాను. పానికోరోడ్డు దొంగల్ని అడొక్కతే మెరుగు."

అని చక్కాబోయి స్నేహితురాలిని తీసుకొనివచ్చింది. ఆ స్నేహితురాలు పానికోరోడ్డులోపుట్టి, అక్కడే పెరిగింది.

"కొంపదీసి, ఆల్బర్ట్ కాదుగదా ?" అంది.

నాకథంతా చెప్పాను. చెప్పడంలో దొంగలమీద ఎక్కువగా విరుచుకు పడకుండా ప్రస్తుత పరిస్థితులమీద నేరం తోసేశాను. ఆమె 'ఆల్బర్ట్'అనేటప్పటికల్లా నాకు బ్రహ్మానంద మయింది. కాని ఆల్బర్ట్ యే పాపా అవునో కాదో అనే సందేహం తీర్చుకోవాలిగా. ఆల్బర్ట్ ఇంటిపేరేమిటని అడిగాను. ఆమెకు ఏదో అనుమానం కలిగి ఆపేరెందుకు ఎత్తామా అని పశ్చాత్తాపడ్డట్టుంది. అయినా తొణకకుండా "ఉహుఁ-ఆల్బర్ట్ అయివుండడు. అయినావిను." అంది.

"విను. నీకు సాయం చెయ్యగలుగుతాననే అనుకుంటున్నా. కాని నువ్వుమాత్రం కొంత ఖర్చుపెట్టాల్సి వుంటుంది."

ఏళ్ళకి పదహారేళ్ళయినా దుర్మార్గపు పనులన్నీ ఆమెకి తెలుసు. దొంగతనాన్ని కప్పిపుచ్చడానికి నాచేత డబ్బుఖర్చు పెట్టించాలనుకుంది.

"పానికోరోడ్డులో చాలామందిని యెరుగుదున్నా. యెవరిని అడిగి అయినా తెలుసుకుంటా. కాని నిన్ను-నిన్ను నమ్మొచ్చా? చూస్తానికి నమ్మదగిన వాడివిలాగానే వున్నావులే"

చల్లగా, చనువుగా, దయ ఒలికిస్తూ నవ్వింది. ఏ మహారాణో నవ్వినట్టుంది. లిండాకేసి తిరిగి అడిగింది:

"యీయన్ని నమ్మొచ్చా?"

ఒక్క నిముషమైనా ఆలస్యం చెయ్యకుండా, "ఆఁ-నమ్మొచ్చు. నాదీపూచీ." అంది లిండా బిగ్గరగా.

"అలాగయితే, నీ సైకిలు తెచ్చిచ్చినవాళ్ళకి యేం బహుమత్తి యిస్తావు?" అని అడిగింది లిండా స్నేహితురాలు.

"నీకో ముద్దిస్తా." అన్నాను.

కాలితో నేల తన్ని, నడుము అల్లలలాడిస్తూ, అర మోడ్పు కనులతో ఆసమయంలో తనకి ముద్దులమీద మనసు లేదనీ నడిరోడ్డుమీద ఉండబట్టిగాని లేకపోతే చిల్లిగవ్వ పుచ్చుకోకుండా కావలసినన్ని ముద్దులు ఇచ్చేదాన్ననీ జవాబిచ్చింది.

"కాని అసలు సంగతేమంటే వాళ్ళు ముద్దులు మురి పాలతో తృప్తిపడే రకంకాదు. నేనూఅంతేననుకో. మాఅమ్మ పూనుకుంటే నీసైకిలు వెదికి తెచ్చిపెట్టగలదు. మా అమ్మ ముసిలిది. ఆ వీధిలోవున్న ముసిలమ్మలందర్నీ యెరుగు. పైగా మంచి తెలివి తేటలు గలది. యింతకీ యెంతయిచ్చుకుంటావ్? యీ రోజుల్లో సైకిలు యెంత ధర పలుకుతోందో తెలుసా? అసలు నువుదాన్ని యెంతకి కొన్నావేవిటి?"

జవాబివ్వడానికి తటపటాయించాను. బాగా చవకగా ఉన్న రోజుల్లో నేనా సైకిలు కొన్నాను. యెంతని చెప్పను? నేను తటపటాయించడంచూసి తనే "పదివేల లీరాలిస్తావా? అంతకు తక్కువయితే వప్పుకుంటా రనితోచదు." అంది.

ఆమెతో నాకు పరిచయమయి పట్టుమని పదినిమిషాలు కాలేదు. అలాంటప్పుడు నేను పేదవాణ్ణనీ, యుద్ధం మూలకంగా చితికిపొయ్యానని ఆమెతో ఎలా చెప్పేది? యుద్ధాల మూలకంగా నిరుపేదలు భాగ్యవంతులవుతారు. భాగ్యవంతులు

నిరుపేదలవుతారు. పొట్టకూటికి పాటుపడనివాళ్ళు బిచ్చమెత్తు కుంటారు. 'యుద్ధాలు వద్దు' అని వారించకుండా మానవుని లోని పశుత్వాన్ని స్వేచ్ఛగా విహరించనీయడమేనా తటస్థత అంటే? నేను మొదటినించీ ఇలా వారించడం సాహితీపరుల కర్తవ్యమని ఘోషిస్తూనే ఉన్నాను. మనలో అనేకమందిమి ఈ కర్తవ్యం నిర్వర్తించలేకపోయ్యాం. ఇక చెయ్యగలిగిం దేమిటి? రొమ్ములు బాదుకుంటూ తప్పంతా మనదే కాని ముందుచూపులేనివాళ్ళది కాదని అంగీకరించడంకంటె గత్యం తరం కనిపించదు. చరిత్ర అనే పిలవబడే గడియారాన్ని చూడ గలిగికూడా యుద్ధాలని ఆపుచెయ్యనివారిది తప్పు. చరిత్రా గడి యారం లాంటిదే. ఆరు గంటల తరువాత ఏడు అవుతుందిగాని నాలుగు కాదని అందరికీ తెలిసిన విషయమే. కవులు, రచయి తలు, వేదాంతులు మేఘాలల్లో విహరిస్తూంటాడు. అలా మేఘాలల్లో విహరిస్తూ కింద, ఈ భూమ్మీద 'పురుగులు,' 'నల్లులు' మూగుతూండడం గమనించరు. పశుప్రవృ త్తులు గంట గంటకూ తల యెత్తుతూ ఉండడం గమనించరు. యుద్ధాలను కూకటి వేళ్ళతోసహా నాశనం చెయ్య లేమని భావించేవాళ్ళయినా యుద్ధాలను తూర్పారపట్టి తీరాలి. ఇదీ నా మతం. 'యుద్ధాలను తూర్పారపట్టండి. యుద్ధాలవల్ల కలిగే విషఫలితాలను మొదలంటూ పెరికి వేయండి.' అని బోధించడం ఒక్కటే నా పొరుగువాడికి నేను చెయ్యగల ఉపకారం. అసలు యుద్ధా లెందుకువస్తాయి? అత్యాశవల్లా, ఇతరుల పతనంమీద మన సౌభాగ్యం ఆధార

పడి ఉంది కాబట్టి పొరుగువాడికి సాయపడడంకన్న అపకారం చెయ్యడం మంచిది అనే తప్పు అభిప్రాయంవల్లా యుద్ధాలు వస్తూంటాయి. 'మాకోసరంకాదు మా బిడ్డలకోసరం పోరాడు తున్నాం. వాళ్ళకి మంచి పరిస్థితులు కల్పించదలచాం.' అని వాదించే దేశభక్తులకు ఒక మనవి. ముందు మీరు బాగా బతకండి. అప్పుడు మీ బిడ్డలు ఇంకా బాగా బతకడానికి అవ కాశం ఏర్పడుతుంది. మీ ఇంటి పెరడులో, మీ పొలంలో కూరగాయలు పండించండి. కష్టపడి పనిచెయ్యండి. మీరు చనిపోయిన తరవాత మీ బిడ్డల కేమీ లోటుండదు. నేటి వారికి లాగా మీరు చనిపోగానే బాంబులవల్ల ధ్వంసయిన ఇళ్ళు, సైనికులు నాశనంచేసిన ఇళ్ళు, దొంగల దోపిడి గురి అయిన ఇళ్ళు మీ బిడ్డల పాలబడవు. యుద్ధాల మూలకంగా శాంతికాలంలోకంటె అనేకవేల రెట్లదొంగలు, ఖూనీకోర్లు తయారవుతారు. ఇదీ యుద్ధంవల్ల కలికే విషఫలితాలు.

యుద్ధాలు వచ్చాయంటే, దొంగలు, ఖూనీకోర్లు అనేక రెట్లు పెరిగారంటే తప్పు ఎవరిది? తప్పు మనది, మన కవులది. నోరు మూసుకుని పడున్నాం కాని యుద్ధాలను వారించడం ఎలాగో తెలుసుకుని, దొంగలను, ఖూనీకోర్లను తలెత్తకుండా చేయవలసింది. అలా చెయ్యకుండా నేను కవినయినందుకు అపరాధంగా నా సైకిలే దొంగల దగ్గరనించి కొనుక్కుం టున్నాను. ఆమె అడిగినదానిలో సగం అంటే అయిదువేల లీరాలు ముడుపు చెల్లించుకోవడానికి అంగీకరించాను. అయితే నా సైకిలు దొరికితేనే ననుకోండి. దొంగలతో వాదించడా

నికీ బేరాలాడడానికీ ఇది సమయం కాదు. అలా చేసిఉంటే ఆమెకు చిరాకు పుట్టేది. దొంగను పట్టుకొని శిక్ష వేయించడం నా ఉద్దేశమని ఆమె అనుమానించడానికి అవకాశం చిక్కేది.

ధైర్యం తెచ్చుకుని నా సైకిలు దొంగిలించినవాడి పేరు నాకు తెలుసునని క్లుప్తంగా చెప్పాను.

"నీ కెలా తెలిసింది?" అని ఆమె అడిగింది. ఆమెలో ఆశ్చర్యంకంటె అనుమానం ఎక్కువగా గోచరించింది.

పానికోరోడ్డుమీద, నా అల్యూమినం సైకిలు వేసుకుని పాపా వెళుతుండగా చూసినవాళ్ళు నాకు చెప్పారనీ, పాపా నా సైకిలును అమ్మజూపాడనికూడా నాకు తెలుసుననీ ఆమెకి సూచించాను.

"పాపా! ఆల్బర్టో యింటిపేరు పాపా అని నాకు తెలీదు. యేమయినా వాడు నీ సైకిలు కొట్టేసి వుండచ్చు. వాణ్ణి నేను బాగా యెరుగున్నా." అందామె.

'బాగా యెరుగున్నా'నని మాత్రమే చెప్పింది. పానికో రోడ్డుమీద ఉండేవాళ్ళల్లో ఐకమత్యం ఎక్కువ. అందుకే పాపానిగురించిన వివరాలేమీ చెప్పకుండా, 'బాగా యెరుగున్నా! అని ఊరుకుంది. పాపా పేరు ఉచ్చరిస్తూ లిండాకు కను గీటింది. అప్పుడు ఆమె కళ్ళల్లో ఈ విషయం చదవగలిగాను.

"సరే. యిప్పుడేం జేద్దాం? విను: మా అమ్మతో యీ విషయం చెబుతాను. ఆవిడ ఆల్బర్టోతో మాట్లాడి ఒప్పిస్తుంది. ఆల్బర్టో పాపా ఒక్కడే అయిందీ కానిదీ తెలిసి పోతుంది. సరేగానీ మరి డబ్బుసంగతి? నీకు అప్పియివ్వాలేనే."

"నువ్వెప్పుడూ యింతే. సమయం వచ్చేసరికి వెనకాడ తావ్." అంది లిండా బడిపిల్లలను మందలించే పంతులమ్మ లాగా, అమెరికావాళ్ళ దగ్గరనించి డబ్బు కాజేయడం ఎలాగో ఆమెకి తనే నేర్పిన దానిలాగా. కాని ఆ పదహారేళ్ళ అమ్మాయి ఇంకా ప్రేమలో పడుతూనే ఉంది. లిండామాత్రం ముద్దులు మురిపాలు లక్ష్యంచెయ్యకుండా డబ్బు జేబులో వేసుకుంటూంది.

"యీ మాదిరిగా చేద్దాం. యీయనగార్ని నే నెరు గున్నా. చిత్రకారుడు. మంచి స్టుడియో, చక్కటి యిల్లూ యీయనకున్నాయి. బీదఅరుపులు అరుస్తుంటాడుగాని నిజం కాదు. అయిదువేల లీరాలు నేను అప్పివ్వగలను. నేను అప్పిస్తాను. తిరిగి నాడబ్బునాకు ముడుతుందనే నమ్మకం నాకుంది." నావంక తిరిగి అన్నది. "నాకు ఆరువేల లీరాలు యిచ్చుకో. రెండు వారాలలో యిచ్చుకోకపోతే, నీ సైకిలు నీచేతికి రాదు, లేకపోతే బేరం యేడువేలదాకా పెంచుతా."

లిండా ఈ మాటలు నవ్వుతాలకే అంది. కాని అన్నంత పనిచేసే మనిషే. చివరికి వడ్డీ వ్యాపారంచేసయినా డబ్బు కూడ బెట్టాలనే భావం ఆమె బుర్రలో పెంపొందు తోంది. అయితేనేం నాదగ్గరమాత్రం వడ్డీకివడ్డీ కట్టి పుచ్చుకో వాలని ఆమెకి లేదు.

"అయితే యేంచేద్దాం?" అని అడిగాను. "బెంగెట్టు కోకు. నేను ఫోనుచేస్తాలే." అంది లిండా, సైకిలు దొరికి తీరు తుంది, ఆరువేలు వస్తాయి, అందులో వెయ్యి మిగుల్చుకో వచ్చు అనే నమ్మకంతో.

ఫోను లిండాదగ్గరనించి వస్తుందని ఆతృతగా కొన్ని రోజులు గడిపాను. పోయినవస్తువు దొరికితే కలిగే ఆనందానికి అంతు ఉంటుందా! అచ్చాఫీసువాళ్ళు, బాతాఖానీరాయుళ్ళు నాకు ఫోనుచేసారు. సైకిలు విషయం మరిచేపోయి ఇతరవిష యాలు ఆలోచిస్తున్నాను. కాని మధ్యమధ్య సైకిలు దొరుకు తుందనే ఆశ నా మనసులో తళుక్కుమంటూనే ఉంది. నాకూ అందరిలాగానే అనేకమయిన చిక్కులు ఒకదానివెంట ఒకటి వచ్చి పడ్డాయి. ఒకచిక్కు తీరిందనుకుంటే ఇంకో రెండు చిక్కులు పొడగట్టేవి. మాపని నానాటికీ తీసికట్టుగా ఉంది. వస్తులమీద వస్తులు పడుకోవలసివస్తోంది. ఆకలి! ఆకలి! ఆకలి ఎలాంటిదో తెలుసా? రెండు పెద్దపెద్ద పర్వతాలమీద భయంకరమయిన మంచుముద్దలు. ఆ రెండు పర్వతాలమధ్య ఒక లోయ. ఆ లోయలో గడ్డ గట్టుకుపోతూంటే ఎలా ఉంటుంది? అలానే ఉంటుంది ఆకలి. మధ్యమధ్య మంద కొడిగా సూర్యరశ్మి పర్వతాగ్రాలమీద పడ్డా, లోయలో చీకటి! కటికచీకటి! ఈ యుద్ధంనించి తప్పించుకోగలమనే ఆశ నానాటికీ సన్నగిలుతోంది. ఆకలితో మలమలమాడి చచ్చి పోతామనే నిస్పృహ రోజురోజుకీ పెరగవలసిందే. కాని అలా పెరగదు. ఒక్కసారిగా కాకుండా క్రమక్రమంగా చలికి బిగు సుకు బిగుసుకు చచ్చిపోతాం. ఆ చావులాంటిదే ఆకలికూడా. చెవులు గళ్ళడిపోతాయి. ఒళ్ళంతా పక్షవాతం వచ్చినట్టుం టుంది. తిండిమీద ధ్యాసపోదు. పూర్వాం మంచిమంచి పదార్థాలు తిన్నామనే సంగతే మరిచేపోతాం. ఆకలి చచ్చి

పోతుంది. ఆకలి తనను తానే నాశనం చేసుకుంటుంది. ఇంకా ఇంత అధ్వాన్నస్థితి మాకు రాలేదు. కాని శీతాకాలం సమీపిస్తోంది. ఆకలి, పస్తులు రోజురోజుకు పెరిగిపోతున్నాయి. తిండి సహించడంలేదు.

ఇలాంటి చావుబతుకుల్లో ఉన్నా ఒకరోజున ఫోను మోగి, లిండామాట వినిపించేసరికల్లా నాకు ప్రాణం లేచి వచ్చింది. శోక సముద్రంలోంచి బయట పడ్డట్లయింది. అయిదు వేల లీరాలు ఇస్తే సైకిలు ఇవ్వడానికి పాపా ఒప్పుకున్నాడని లిండా ఫోనులో చెప్పింది. కాసేపటికల్లా లిండా స్నేహితురాలు నా స్టూడియో తలుపు తట్టింది. తలుపుతీసి చూద్దును కదా, నా సైకిలు పుచ్చుకుని ఆమె నుంచుంది. హాండిలుబారుకి గులాబీ పూలగుత్తి కట్టింది. ఆరువేల లీరాలు యివ్వకపోతేనేం అనిపించింది. కాని అయిదువేల లీరాలు, లిండాకు బహుమానంగా ఒక వెండి ఉంగరం ఇచ్చాను.

ఏమీ గొడవ పెట్టకుండా సైకిలు తిరిగి ఇచ్చివేయడానికి పాపాఒప్పుకున్నాడా లేదా అనేవిషయం నాకు పట్టలేదు. సైకిలు తిరిగి రాబట్టే విషయానికి ఇంత ప్రాముఖ్యం ఇచ్చినందుకు నామీాద నాకే కోపంవచ్చింది. పోయిన వస్తువు తిరిగి దొరికినపుడు మనంపొందే ఆనందానికి అంతంటూ ఉండదు!

పోగొట్టుకున్నదానిని వెతకడంలోనే జీవితరహస్యం ఇమిడిఉంది. ఒకటి రెండు సార్లు పోయినవి దొరకవచ్చు. కానీ మూడోసారి దొరకకపోవచ్చు. జీవితమే అంత! అడ్డంకులన దాటుకుంటూ వెళ్ళీవెళ్ళీ చివరికి చతికిలబడే పందెపు ఆట

లాంటిదే జీవితం. మాతృగర్భంలోంచి వెలువడి భూమ్మీద మానవుడు జన్మించేటపుడే ఈ పందెపు ఆట ప్రారంభమవుతుంది. కళ్ళు గట్టిగా మూసుకుని చనుబాలు తాగుతూ. గులాబీరంగు ముక్కుతో తల్లివక్షం కుమ్ముతాడు. తరవాత చనుబాలు మానేసి తప్పటడుగులు వేయడానికి ఊతగా తండ్రి చెయ్యి గట్టిగా పట్టుకుంటాడు. చనిపోయేలోపల ఎన్నిటినో అపేక్షిస్తాడు. కాని నేనుమాత్రం చనిపోయేముందు స్నేహితుల మొహాలకోసరం వెతుకుతాను.



# అమల

అమల ఓ పేద కుటుంబంలో పుట్టింది. పెరిగింది. ఓ ఉండవాళ్ళిబ్బాయిని పెళ్ళాడింది. కాని, ఆమె ఆశలన్నీ నిరాశలైనాయి. ఆమె మామ ఆమెను మళ్ళీ పుట్టింటికి పంపించేశాడు. అప్పుడే ఆమెజీవితంలో ప్రమథ్ ప్రవేశించాడు. అతడు ఆమెను లొంగదీసుకోటానికి పన్నిన పన్నాగాల్లో ఆమె తల్లిదండ్రులుకూడ అతనికే సహాయపడ్డారు. కాని, అమె యేమాత్రం తొణకలేదు. బెణకలేదు. ఆమెలో వస్తున్న మార్పుని గమనిస్తున్న ప్రమథ్ ఆమెకోసం చివరిసారిగా వలపన్నాడు. ఆ వలలో ఆమె చిక్కుకుందో, లేదో, ఆమెకు రచయిత చూపిన దారి మంచీ, చెడూ మీరే చదివి నిర్ణయించండి! ఇందులో రచయిత ఉపేంద్రనాథ్ గంగోపాధ్యాయగారు స్త్రీ సమస్యల్ని చక్కగా చిత్రించారు. తప్పక చదవండి! ప్రతివారూ చదవవలసిన ఉత్తమ నవల!

చక్కని ముఖచిత్రం! ముచ్చటకొలిపే ముద్రణ!

125 పేజీలు. వెల : 1—4—0.

నేడే మీ కాపీకి వ్రాయండి.

## ఐశ్లోగా పబ్లికేషన్స్

విజయవాడ-2.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA132B125 |
| పుస్తకం పేరు | సైకిల్ దొంగ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 123 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 1, 2 ,BCI |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Yuvishanavi Sree |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |